# వైరుధ్యం



(ON CONTRADICTION)



రచన:

మావోసేటుంగ్

అనువాదం:

డి. వి. అప్పారావు, బి. ఏ.,



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# వైరుధ్యం

వస్తువులలో 'వైరుధ్యం' అనే సూత్రం, అనగా, 'వ్యతిరేకతలు కలసివుండటం' అనే సూత్రం భౌతికవాద గతితార్కిక దృక్పథానికి మూలసూత్రం. లెనిన్ యిలా చెప్పాడు: "సరైన అర్థంలో చెప్పాలంటే, వస్తుసారాంశంలో ఇమిడి యున్న వైరుధ్యాలను అధ్యయనం చేయటమే గతితర్కం." లెనిన్ యీ "వైరుధ్య" సూత్రాన్ని గతితార్కిక విధానం యొక్క సారాంశమని, మణిపూసయని అనేవాడు.♦ అందుచేత ఈ "వైరుధ్య" సూత్రాన్ని అధ్యయనం చేయటంలో మన మనేక విషయాలను, అసంఖ్యాకమైన తాత్విక సమస్యలను తడవకుండా వుండలేము. ఈ సమస్యలన్నింటినీ మనం పరిష్కరించగలిగితే భౌతికవాద గతితార్కిక విధానానికి మూలమైన భావాన్ని అర్థంచేసుకొనేస్థితికి వస్తాం. ఆ సమస్యలు యివి: రెండు ప్రాపంచిక దృక్పథాలు 'వైరుధ్యం' యొక్క విశ్వవ్యాపిత

---

♦ గతితార్కిక విధానాన్ని గురించి లెనిన్ "ఒక వస్తువును విభాగం చేయటం, దానిలోని వైరుధ్యభాగాలను గుర్తింపటం గతితార్కిక విధానం యొక్క సారాంశం (గతితార్కిక విధానంయొక్క ఏకైక ప్రధాన లక్షణం కాకపోయినా ప్రధాన లక్షణాలలో వకటి).

గతితార్కిక విధానమంటే 'వ్యతిరేక శక్తులు కలిసివుండటం' అనే సిద్ధాంతమేనని చెప్పవచ్చు. అలా చూసినప్పుడు గతితార్కిక విధానంలోని మణిపూస గ్రాహ్యమవుతుంది. అయితే దాన్ని యింకా వివరించి వృద్ధి పర్చాల్సి యుంటుంది."

స్వభావము, 'వైరుధ్యం' యొక్క ప్రత్యేక స్వభావము; ప్రధానమైన 'వైరుధ్యము', 'వైరుధ్యం' యొక్క ప్రధాన అంశం; 'వైరుధ్యం'యొక్క రెండు అంశాలమధ్య ఘర్షణ, ఐక్యత 'వైరుధ్యం'లో ప్రాతికూల్యాని కున్న పాత్ర.

ఇటీవలి సంవత్సరాల్లో సోవియట్ యూనియన్‌లోని తత్వపరిషత్తులు డెబొరిన్ పీఠానికి చెందిన భావవాదాన్ని విమర్శకు గురిచేశాయి; ఇది మనలోగూడా పెద్ద ఆసక్తిని రేకెత్తించింది. డెబొరిన్ భావవాదం చైనా కమ్యూనిస్టుపార్టీలో చాలా చెడ్డ ప్రభావాన్ని కలిగించింది. మన పార్టీలోవున్న ఛాందసపు ఆలోచనా పద్ధతులకు యీ డెబొరిన్‌పీఠంయొక్క కార్యాచరణ విధానాలతో ఏమీ సంబంధం లేదనటానికి వీలు లేదు. కనుక, నేటి మన తత్వశాస్త్రాధ్యయనానికి ఛాందసపు ఆలోచనా పద్ధతులను తుదముట్టించటమనే ప్రధాన లక్ష్యముండాలి.

## రెండు ప్రాపంచిక దృక్పథాలు
## (Two world outlooks)

మానవ విజ్ఞాన చరిత్రలో ప్రపంచ పరిణామ సూత్రాలను గురించి ఎల్లప్పుడూ రెండు దృక్పథాలు వుంటూవున్నాయి. అవి జడాత్మక దృక్పథం ఒకటి, గతితార్కిక దృక్పథం మరొకటి. ఈ రెండూ పరస్పరం వ్యతిరేకమైన దృక్పథాలు. లెనిన్ ఇలా అన్నాడు: "పరిణామాన్ని గురించి ప్రధానమైన రెండు (సాధ్యమైన? లేక చారిత్రకంగా గమనించబడే రెండు) అభిప్రాయాలు యివి: క్షీణిస్తూ, వృద్ధి అవుతూ, యివే మరల మరల సంభవిస్తూ పరిణామం చెందటం;

ప్రతికూలతలు సమైక్యంగా వుంటూ పరిణామం చెందటం ఒకే వస్తువు పరస్పరం సంబంధంలేని ప్రతికూలతలలోకి విభాగమవటం, ఆ విభాగాలు పరస్పరసంబంధం కలిగించు కోవటం)." భిన్నమైన యీ రెండు ప్రాపంచిక దృక్పథాలనే యిచ్చట లెనిన్ పేర్కొంటున్నాడు.

చరిత్రలో చాలాకాలంవరకు చైనాలోను, యూరప్ లోను జడాత్మకతర్కం, ప్రపంచాన్ని గురించిన భావవాద దృక్పథంలో భాగంగానేవుంటూ, మానవుని ఆలోచనారంగంలో అగ్రస్థానాన్ని వహించింది. యూరపులో బూర్జువావర్గ ప్రథమ దశలో భౌతికవాదం జడాత్మకతర్కంగాగూడా వుండేది. యూరప్‌లోని అనేక దేశాల సాంఘికార్థిక విధానం అత్యంతాభి వృద్ధి చెందిన పెట్టుబడిదారీ దశలోకి ప్రవేశించటంవల్లనూ, ఉత్పత్తి శక్తులూ, వర్గపోరాటమూ, శాస్త్రపరిజ్ఞానము యివన్నీ చరిత్రలో యెప్పుడూ లేనంత వున్నతదశకు అభివృద్ధి చెందటం వల్లనూ, పారిశ్రామిక కార్మికవర్గం చారిత్రక పరిణామంలో బ్రహ్మాండమైన సంచలనశక్తిగా తయారవటం వల్లనూ మార్క్సిస్టు భౌతికవాద గతితార్కిక ప్రాపంచిక దృక్పథం రూపొందింది. అట్టి పరిస్థితిలో, భౌతికవాద గతి తార్కిక విధానాన్ని ఎదుర్కోటానికిగాను, బహిరంగంగా కంకణం గట్టిన నికృష్టంగా నగ్నమైన అభివృద్ధి నిరోధక భావవాదానికి తోడు, బూర్జువా వర్గంలోనుండి నైచ్య పరిణామవాదంగూడా రూపొందింది.

జడాత్మక తర్కం లేక నైచ్య పరిణామవాద ప్రాపం చిక దృక్పథమంటే ప్రపంచాన్ని పాక్షికమైన, చలనంలేని,

విడివిడి దృక్పథంతో చూడటమే అవుతుంది. జడాత్మక ప్రాపంచిక దృక్పథము, ప్రపంచంలోని అన్నివస్తువులను, వాటి రూపాలను, వాటి సంతతిని శాశ్వతంగా ఒకదానితో ఒకటి సంబంధం లేనివిగాను, శాశ్వతంగా మార్పు లేనివిగాను పరిగణిస్తుంది. ఒకవేళ మార్పేమైనా వున్నట్లు అంగీకరించినా, ఆ మార్పును కేవలం ఆవస్తువుయొక్క పరిమాణంలో హెచ్చు తగ్గుల మార్పుగాను, లేక స్థలమార్పుగానుమాత్రమే పరిగణి స్తుంది. పైగా ఆ మార్పు (హెచ్చు తగ్గుల మార్పు లేక స్థల మార్పు) వస్తువుల అంతర్గత లక్షణాలవల్ల గాక, బాహ్యశక్తుల ప్రాబల్యంవల్ల కలుగుతున్నట్లుగా పరిగణిస్తుంది. ప్రపంచంలోని అన్నిరకాల వస్తువులు, వస్తులక్షణాలు, అవి ఆవిర్భవించిన నాటినుండి మార్పేమీ లేకుండా అలాగే వున్నాయని జడాత్మక తార్కికులు నమ్ముతారు. ఇక తర్వాత సంభవించే యేమార్పయినా కేవలం పరిమాణంలో కలిగే హెచ్చుతగ్గులు మాత్రమే నంటారు. ఎల్లప్పుడూ ఒక వస్తువు మరల మరల అదే వస్తువుగా వుత్పత్తి కాగలదుగాని, భిన్నమైనరూపంలోకిమాత్రం మారటం జరగదని జడాత్మక తార్కికు లంటారు. వీరి దృష్టిలో పెట్టుబడిదారీ దోపిడీగాని, పెట్టుబడిదారీ పోటీగాని, పెట్టుబడిదారీ సమాజంలోని వ్యక్తిత్వ సిద్ధాంతంగాని ఇవన్నీ పాతకాలంనాటి బానిస సమాజంలోసైతం వుండగలవు. ఇకముందుకూడా ఎట్టి మార్పూ లేకుండా అలాగేవుంటాయి. ఇక సాంఘిక పరిణామా నికి కారణాలుగా, వీరు సమాజానికి బాహ్యంగా వుండే భౌగో ళిక, వాతావరణ, నైసర్గిక పరిస్థితులను వుదహరిస్తారు. వీరు వస్తువుల అంతర్గత వైరుధ్యంలో, వస్తువుల పరిణామానికి

కారణ మున్నదనే భౌతికవాద గతితార్కిక సిద్ధాంతాన్ని త్రొక్కి, వివేకశూన్యులై పరిణామాలకుగల కారణాలను వస్తువులకు బాహ్యంగా నున్నట్లు భావిస్తారు. కనుకనే వారు వస్తులక్షణాలలో వున్న అనేకత్వాన్ని గమనించలేరు. అలాగే వారు ఒక రకమైన వస్తువు మరోరకమైన వస్తువులోకి ఎలా మారుతుందో గూడా గమనించలేరు. ఈ విధమైన ఆలోచనా విధానం యూరప్‌లో 17, 18 శతాబ్దాలలో యాంత్రిక భౌతిక వాద రూపంలోను, 19 వ శతాబ్దాంతాన, 20 వ శతాబ్దాదిని నైచ్యపరిణామవాద రూపంలోను వుండేది. చైనాలో "స్వర్గం మారదు, స్వర్గమార్గం మారదు" అనే జడాత్మక ఆలోచనా విధానం క్షీణించిపోతున్న ఫ్యూడల్ పాలకవర్గాలచే చాలాకాలంవరకు బలపరచబడుతుండేది. గత నూరు సంవత్సరాలలో యూరప్‌నుండి దిగుమతి చేయబడిన యాంత్రిక భౌతిక వాదము, నైచ్య పరిణామవాదములు బూర్జువావర్గంచే బలపరచ బడుతుండేవి.

జడాత్మక ప్రాపంచిక దృక్పథానికి వ్యతిరేకంగా భౌతిక గతితార్కిక ప్రాపంచిక దృక్పథం ఇలా తెలియజేస్తుంది: వస్తువుల పరిణామాన్ని వాటి అంతరంగం నుండీ, ఒక వస్తువుకు తదితర వస్తువులతోగల సంబంధంనుండీ అధ్యయనం చేయాలి. అంటే, వస్తువుల అంతర్గతమైన, అనివార్యమైన స్వయంచలనమే ఆ వస్తువుల పరిణామము. ప్రతి వస్తువును దానిచలనంలోనే అవగాహనచేసుకోవాలి. ప్రతివస్తువు, దానిచుట్టూ వున్న యితర వస్తువులు పరస్పరం సంబంధం కలిగి, పరస్పర ప్రభావం కలుగ జేసుకుంటూనే వుంటాయి. ఇది భౌతిక గతితార్కికవాద

ప్రాపంచిక దృక్పథము. వస్తువుల పరిణామానికి మూలకారణం ఆ వస్తువులకు బాహ్యంగాగాక వాటి అంతరంగంలోను, వా' ఆంతరంగిక వైరుధ్యాలలోను వుంటుంది.

అన్ని వస్తువులలోనూ అలాంటి వైరుధ్యాలు వుండటం మూలంగానే, వస్తువుల చలనము, పరిణామము యేర్పడుతున్నాయి. వస్తువులో వున్న యీ వైరుధ్యమే ఆవస్తువుయొక్క పరిణామానికి మూలకారణం; ఆ వస్తువుకు యితర వస్తువులతో వున్న పరస్పర సంబంధం, పరస్పరం వున్న ఆధారం - యివి ఆ వస్తువుయొక్క పరిణామానికి గల ఉపకారణాలు. ఈవిధంగా భౌతిక గతితర్కం బా హ్యా కా ర ణా లు, బా హ్య ప్రో త్సా హ ం అనే జడాత్మక యాంత్రిక భౌతిక, వైచ్య పరిణామవాద సిద్ధాంతాన్ని తీవ్రంగా ఎదుర్కొంటుంది. కేవలం బాహ్యాకారణాలు, వస్తువులలో యాంత్రిక చలనాన్ని మాత్రమే కలిగిస్తాయి. అంటే, ఆకారంలోను, పరిమాణం (Quantity) లోను మార్పులను మాత్రమే కలిగిస్తాయి. కాని వస్తువులు ఎందుచేత వేల తరహాల గుణగణాలను కలిగివుంటాయో, వస్తువులు ఒకరూపంనుండి మరోరూపంలోకి ఎందుచేత మారుతూవుంటాయోమాత్రం వివరించలేవు. నిజానికి, బాహ్యశక్తులద్వారా ప్రోత్సహించబడే యాంత్రికచలనంగూడా వస్తువులలోని అంతర్గత వైరుధ్యాల వల్లనే కలుగుతున్నది. మొక్కలు, జంతువుల్లోని పెరుగుదల, వాటియొక్క పరిమాణాభివృద్ధి ప్రధానంగా వాటి అంతర్గత వైరుధ్యాలవల్లనే కలుగుతున్నవి. అదేవిధంగా సాంఘిక పరిణామంగూడా ప్రధానంగా బాహ్యాకారణాలవల్లగాక

అంతర్గత కారణాలవల్లనే సంభవిస్తున్నది. అనేక దేశాలు కొదాపు ఒకే విధమైన భౌగోళిక, వాతావరణ పరిస్థితుల్లో వున్నాయి; ఐనప్పటికీ వాటి అభివృద్ధిలో వ్యత్యాసాలు, హెచ్చుతగ్గులు విపరీతంగా వున్నాయి. ఒకేదేశం దాని భౌగోళిక, వాతావరణ పరిస్థితులు మార్పుచెందకుండానే, బ్రహ్మాండమైన సాంఘిక పరిణామాలను పొందుతున్నది. రష్యా, జపానుదేశాల భౌగోళిక, వాతావరణ పరిస్థితులు మార్పు చెందకుండానే సామ్రాజ్యవాద రష్యా సోషలిస్టు సోవియటు యూనియన్‌గాను, వెనుకబడియున్న ఫ్యూడలిస్టు జపాను సామ్రాజ్యవాద జపానుగాను పరిణామం చెందాయి. చాలకాలం ఫ్యూడలిస్టు ఆధిపత్యంలోనున్న చైనా గత నూరుసంవత్సరాలలో పెద్దమార్పులను పొందింది. ఇప్పుడు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో గూడిన నవచైనాగా రూపొందే మార్గంలో పయనిస్తున్నది. అయినప్పటికీ దాని భౌగోళిక వాతావరణ పరిస్థితులు మార్పుచెందలేదు. మొత్తం భూమి యొక్క, దాని ప్రతిభాగంయొక్క భౌగోళిక, వాతావరణ పరిస్థితులు మార్పు జెందుతున్నాయి. అయితే సమాజంలోగలిగే మార్పులతో పోల్చుకుంటే యీమార్పులు అతిస్వల్పంగా గోచరిస్తాయి. మొదటి రకం మార్పులు (భౌగోళిక వాతావరణం) లక్షల, కోట్ల సంవత్సరాల కాలవ్యవధిలో గణనీయంగా కనబడతాయి. రెండవరకం మార్పులు కేవలం వేల, వందల, పదుల సంవత్సరాల వ్యవధిలోను యింకా (విప్లవ దశలో అయితే) కొలది సంవత్సరాలు, మాసాల వ్యవధిలోనే గణనలోకి వస్తాయి. భౌతికవాద గతితార్కిక దృక్పథం ప్రకారం,

ప్రకృతిలోని మార్పులు ప్రధానంగా ప్రకృతిలోని అంతర్గత వైరుధ్యాల పరిణామం మూలంగా సంభవిస్తాయి. సాంఘిక మార్పులు ప్రధానంగా సమాజంలోని అంతర్గత వైరుధ్యాల పరిణామం మూలంగా సంభవిస్తాయి; ఉత్పత్తి శక్తులకు ఉత్పత్తి సంబంధాలకు మధ్యవున్న వైరుధ్యం, వర్గాలమధ్య వైరుధ్యం, కొత్త పాతలమధ్య వైరుధ్యం - ఇవే సమాజం యొక్క అంతర్గత వైరుధ్యాలు. ఈ వైరుధ్యాల పరిణామమే సమాజాన్ని ముందుకు నెట్టుతుంది. పాత సమాజాన్ని తోసివేసి, నూతన సమాజ మేర్పడే విధానాన్ని ప్రారంభిస్తుంది. భౌతిక గతితార్కిక సిద్ధాంతం బాహ్య కారణాలను లెక్కలోకి తీసుకోకుండా వదలేస్తుందా ! కానేకాదు. భౌతిక గతితార్కిక సిద్ధాంతం బాహ్యకారణాలను మార్పుకు ఉపకారణంగాను, అంతర్గత కారణాలను మార్పుకు ప్రాతిపదికగాను, బాహ్యకారణాలు అంతర్గత కారణాలద్వారా చరించేవిగాను పరిగణిస్తుంది. అనువైన శీతోష్ణస్థితిలో కోడిగుడ్డు పిల్లగా మారుతుంది. కాని రాతిని కోడిపిల్లగా మార్చగలిగే శీతోష్ణస్థితి వుండనేరదు. ఎందుకంటే, ఆ రెండింటి మూలలక్షణాలు భిన్నమవటం చేత. ఎల్లప్పుడూ వివిధదేశాల ప్రజలమధ్య ఎడతెగకుండా పరస్పర ప్రభావం వుంటూనే వుంటుంది. పెట్టుబడిదారీ దశలోను, ముఖ్యంగా సామ్రాజ్యవాద దశలోను, కార్మిక విప్లవ దశలోను వివిధ దేశాలమధ్య పరస్పరం శక్తివంతమైన రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక ప్రభావాలు బ్రహ్మాండంగా వుంటూవచ్చాయి. సోషలిస్టు అక్టోబరు విప్లవం రష్యాచరిత్రలోనేగాక, ప్రపంచ చరిత్రలోనే నూతన

శకంలో సంభవించింది; ఆ విప్లవం ప్రపంచంలోని అన్ని దేశాల లోని అంతర్గత పరిణామాలపైన తన ప్రభావాన్ని కలిగించి అదేమాదిరిగా ప్రత్యేక ప్రతిభావంతమైన పద్ధతిలో చైనా ఆంతరంగిక పరిణామాలపైనకూడా ప్రభావాన్ని కలిగించింది. ఎలాగైనా సరే, ఆవిధమైన పరిణామాలు వివిధ దేశాలలోను, చైనాలోను వున్న అంతర్గత ఆవశ్యకత ననుసరించే సంభవించాయి. యుద్ధంలో రెండుసైన్యాలు తలబడతాయి; ఒకటి గెలుస్తుంది. మరొకటి ఓడిపోతుంది. జయాపజయాలు రెండూ ఆంతరంగిక కారణాలవల్లనే సంభవిస్తాయి. ఒకసైన్యం తన బలాన్ని బట్టిగాని, సక్రమ సైన్యాధిపత్యంవల్లగాని విజయం గాంచుతుంది; మరొకటి తన బలహీనత వల్లగాని, అసమర్థమైన సైన్యాధిపత్యంవల్లగాని ఓడిపోతుంది. ఆంతరంగిక కారణాలద్వారానే బాహ్యాకారణాలు ఆచరణలోకి వస్తాయి. 1927 లో చైనా బడా బూర్జువావర్గం చైనా కార్మిక వర్గంలోనే (చైనా కమ్యూనిస్టుపార్టీలోనే) వుంటున్న అవకాశవాదం ద్వారా వ్యవహరిస్తూ (అవకాశవాదాన్ని ఆధారం చేసుకొని) చైనా కార్మికవర్గాన్ని ఓడించింది. మన మీా అవకాశవాదాన్ని నిర్మూలించగానే చైనావిప్లవం తిరిగి పురోగమనం సాగించింది. తర్వాత మన పార్టీలో దుందుడుకు (Adventurism) వాదం అంకురించగానే చైనావిప్లవం మరలా శత్రువుచేతుల్లో చావుదెబ్బలు తిన్నది. మన మీా దుందుడుకుతనాన్ని రూపుమాపగానే, మరల మన ఆశయం పురోగమించ సాగింది. కాబట్టి ఒక రాజకీయపార్టీ విప్లవాన్ని విజయవంతంగా నిర్వహించాలంటే, ఆ పార్టీ తన సరైన రాజకీయ

విధానంమీాదను, తన నిర్మాణాన్ని సమీాకృతమొనర్చుకోటం మీాదను ఆధారపడవలసిఉంటుంది.

గతితార్కిక ప్రపంచ దృక్పథం పూర్వకాలమునందే చైనాలోను, యూరప్‌లోను అంకురించింది. ఈ ప్రాచీన గతి తార్కిక సిద్ధాంతం ప్రాథమిక లక్షణాలను గలిగి మొరటుగా వుండేది. నాటి సాంఘిక చారిత్రకపరిస్థితుల కనుగుణ్యంగా వున్న ఆ గతితార్కికవాదం సంపూర్ణమైన సిద్ధాంతి జ్ఞానాన్ని రూపొందించలేకపోయింది; అందుచేత ప్రపంచాన్ని సంపూర్ణంగా వివరించలేకపోయింది; తర్వాత సాధారణ తర్కంచే త్రొక్కి వేయబడింది. 18 వ శతాబ్దాంతంనుంచి 19 వ శతాబ్దాది వరకూ జీవించిన ప్రఖ్యాత జర్మన్ తత్వవేత్త హెగెల్ గతి తార్కిక సిద్ధాంతాభివృద్ధికి చాలా దోహదం చేశాడు. కాని అతనిది భావవాద గతితార్కిక సిద్ధాంతం. కార్మికోద్యమంలో అద్వితీయ కర్మవీరులైన మార్క్స్, ఎంగెల్సులు మానవ విజ్ఞాన చరిత్రలో సాధించబడిన నిర్దిష్ట విజయాలనుండి సారాన్ని (Synthisis) తీశారు. ప్రత్యేకంగా హెగెల్‌యొక్క గతి తార్కిక సిద్ధాంతంనుంచి హేతుయుక్తమైన (Rational-elements) సూత్రాలను విమర్శనాత్మకంగా స్వీకరించి అద్భుతమైన గతితార్కిక భౌతికవాద, చారిత్రక భౌతికవాద సిద్ధాంతాలను నిర్మించారు; తత్ఫలితంగా మానవ విజ్ఞానచరిత్రలో అద్వితీయమైన గొప్పవిప్లవం సంభవించింది. దరిమిలా, యీ గొప్పసిద్ధాంతాన్ని లెనిన్, స్టాలిన్‌లు ఇంకా అభివృద్ధి పర్చారు. ఇది చైనాలో ప్రవేశపెట్టబడగానే చైనా వైజ్ఞానిక లోకంలో అద్భుతమైన మార్పులను తీసుకొచ్చింది.

ఈ గతితార్కిక ప్రాపంచికదృక్పథం అనేక వస్తువుల యొక్క వ్యతిరేకతలలోని గమనాన్ని పరీక్షించటంలోను, పరిశీలన జరపటంలోను మానవుడు ఎలా నైపుణ్యం సంపాదించవలెనో ప్రధానంగా నేర్పుతుంది. అట్టి నైపుణ్యమైన పరిశీలనా ప్రాతిపదికపై వైరుధ్యాలను పరిష్కరించే పద్ధతులను గోచరింపజేస్తుంది. ఆకారణంగా, వస్తువులలోని 'వైరుధ్య' సూత్రాన్ని మనం నిర్దిష్టంగా అవగాహన చేసుకోటం అత్యంత ప్రధానమైనదిగా వుంటుంది.

## 2. వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వం

విశదీకరణ సౌలభ్యం కొరకు నేను మొదట్లో వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని గురించీ, తర్వాత వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్నిగురించీ వివరిస్తాను. మార్క్సిస్టు సిద్ధాంతానికి సృష్టికర్తలు, వ్యాపకకర్తలు అయిన మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్లు భౌతికవాద - గతితార్కిక ప్రాపంచిక దృక్పథాన్ని నిర్ధారణ చేశారు. మానవ చరిత్ర, ప్రకృతి చరిత్రల పరిశీలనయొక్క అనేక అంశాలకు సమాజములోను, ప్రకృతిలోను జరిగే మార్పులయొక్క అనేక అంశాలకు (సోవియట్లోవలె) భౌతికవాద గతితార్కిక సూత్రాలను అత్యంత జయప్రదంగా అన్వయించగలిగారు. వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వం అసంఖ్యాకప్రజలచే అంగీకరించబడింది. గనుక యీ సమస్యను విపులీకరించటానికి కొద్దిమాటలుమాత్రమే చెబితే సరిపోతుంది. అయితే వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని గురించి అవగాహన చేసుకోని చాలామంది కామ్రేడ్సు, ముఖ్యంగా ఛాందసులు యింకా వున్నారు. వైరుధ్యంయొక్క

విశ్వవ్యాపకత్వం దాని ప్రత్యేకత్వంలోనే మనుగడందని వా..
తెలియదు. విప్లవ కార్యాచరణ గమనంలో మనలను అ..
నిర్దిష్టసమస్యలు ఎదుర్కొంటాయి. వానిలో యిమిడియున్న
వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని అధ్యయనం గావించటం
మనకు మార్గదర్శకంగా వుండి, ప్రముఖపాత్ర వహిస్తుందనే
విషయాన్ని ఈ ఛాందసులు తెలుసుకోటంలేదు. కనుక,
వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వ సమస్యను శ్రద్ధాసక్తులతో
అధ్యయనం చేయవలసియుంటుంది. ఈ కారణంవల్ల వస్తువులోని
వైరుధ్యాన్ని మనం పరీక్షించేటప్పుడు మొదట వైరుధ్యంయొక్క
విశ్వవ్యాపకత్వసమస్యను పరిశీలించి, తర్వాత వైరుధ్యంయొక్క
ప్రత్యేకత్వసమస్యను శ్రద్ధతో పరిశీలించాలి. చివరకు వైరుధ్యం
యొక్క విశ్వవ్యాపకత్వ సమస్య దగ్గరకు తిరిగి చేరుకోవాలి.

వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వం లేక పరిపూర్ణత్వం అనే సమస్యకు ద్వంద్వార్థముంది. ఒకటి ఏమంటే: వైరుధ్యమనేది అన్నివస్తువుల యొక్క అభివృద్ధిక్రమంలోనూ వుంటుంది. రెండో అర్థమేమంటే: ప్రతివస్తువుయొక్క అభివృద్ధిక్రమం లోను మొదట్టినుండి చివరివరకు వ్యతిరేకశక్తుల చలనం వుంటుంది.

"చలనమనేదే ఒక వైరుధ్యం" అని ఎంగెల్సు అన్నారు. వ్యతిరేకశక్తుల సమైక్యత అనే సూత్రాన్ని "ప్రకృతియొక్క అన్నిగమనవిధానాలలోను, అన్నివస్తువులలోను (మేధస్సు, సమాజములతోసహా) వున్న విరుద్ధమైన, వ్యతిరేకమైన, పరస్పర స్వతంత్రమైన పోకడలను గుర్తించటము"గా లెనిన్ నిర్వచిం

...రు. ఈ అభిప్రాయాలు సరియైనవేనా ? అవును, సరైనవే. ...వస్తువులలోనూ ఇమిడియున్న వైరుధ్యంయొక్క అంశాల మధ్యవుండే పరస్పర అధీనత, పరస్పర సంఘర్షణలే అన్ని వస్తువుల అస్తిత్వాన్ని, వాటి అభివృద్ధిని నిర్ణయిస్తాయి. వైరుధ్య మనేది లేకుండా ఏదీ లేదు; వైరుధ్యం లేకుండా ప్రపంచమే వుండదు.

చలనం (అంటే యాంత్రికచలనం)యొక్క మామూలు రూపాలకు వైరుధ్యమనేది పునాది. చలనంయొక్క ఉన్నత ...రల రూపాలకు అంతకంటె ప్రధానంగా అది పునాది.

వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని ఎంగెల్సు యీ మాటల్లో విశదీకరించారు: "యాంత్రికమైన మామూలు స్థల మార్పులోనే వైరుధ్యం యిమిడియుంటే, పదార్థచలనం యొక్క ఉన్నతరూపాల సందర్భంలో వైరుధ్యం యిమిడి యుండటం యింకా యథార్థం. ఇక జీవకోటి, దాని అభివృద్ధి విషయాల్లో మరీను.......... ప్రతి పని ప్రతి సమయంలో అది అదిగా వుంటుంది. మరొకటిగాకూడా వుంటుంది—జీవ మంటే సరిగ్గా యిదే. వస్తువులలోనూ, గమన విధానము లోను యిమిడియున్న వైరుధ్యమే జీవం. ఈ వైరుధ్యమే ఎడ తెగకుండా వృద్ధివిస్తుంటుంది. తనకు తానే పరిష్కరించు కొంటుంది. వైరుధ్యం ఆగిపోగానే జీవంకూడా అంతమవు తుంది. దాని స్థానంలో మరణం ప్రవేశిస్తుంది. అదేవిధంగా ఆలోచనారంగంలోకూడా మనం వైరుధ్యాలను తప్పించుకో లేమనేది కనుక్కున్నాం. ఉదాహరణకు తన విజ్ఞాన సముపా ...ర మానవునికిగల సామర్థ్యం అనంతమైనది. కాని

బాహ్యాపరిస్థితులవల్ల తమ మేధాశక్తి పరిమితివల్ల మానవుం ఆ యా దశలలో సాధించగల విజ్ఞానానికి పరిమితి వుంది. ఆ అనంత సామర్థ్యానికి, ఈ పరిమిత సంపాదనకు గల వైరుధ్యమే తరతరాలుగా సాగే నిరంతర పురోగమనానికి మూలం.

"........ఉన్నతగణిత శాస్త్ర ప్రధాన సూత్రాలలో వైరుధ్యమనేది ఒక మూలసూత్రం........

"అంతేకాదు. సాధారణ గణితశాస్త్రముకూడ వైరుధ్యములతో ఇమిడి వున్నది......"

వైరుధ్యంయొక్క సర్వవ్యాపకత్వాన్ని గురించి లెనిన్ కూడ యీవిధంగా విశదీకరించారు:

"గణితశాస్త్రంలో: + (కూడిక) — (తీసివేత); ఏకీకరణ (Integral) విభిన్నీకరణ (Differential Calculus.)

"యంత్రశాస్త్రంలో: చర్య, ప్రతిచర్య.

"పదార్థ విజ్ఞానశాస్త్రం (Physics) లో: పాజిటివ్, నెగిటివ్ విద్యుచ్ఛక్తి.

"రసాయనిక శాస్త్రం (Chemistry) లో: అణువుల సంయోగము, వియోగము.

"సాంఘిక శాస్త్రం" (Social Science) లో: వర్గ పోరాటము.

యుద్ధంలో దాడి - ఆత్మరక్షణ, పురోగమనము - తిరోగమనము, జయము - అపజయము - ఇవన్నీ వైరుధ్యంతో కూడుకొన్న విషయాలు. ఒకటి లేకుండా రెండవది వుండ లేదు. ఈ రెండు అంశాలు ఒకదానితో ఒకటి ఘర్షణ పడతాయి, కలు

స్తాయి. మొత్తము యుద్ధములో ఇవన్నీ యిమిడి వున్నాయి. వే యుద్ధగమనాన్ని నిర్ణయిస్తాయి. యుద్ధ సమస్యలను పరిష్కరిస్తాయి.

మానవుని అభిప్రాయాలలో ప్రతిఒక్క ఘర్షణను బాహ్యంగా కనబడే వైరుధ్యాలయొక్క ప్రతిబింబ గా పరిగణించాలి. బాహ్యంగా కనపడే వైరుధ్యాలు ఆలోచనలో ప్రతిబింబిస్తాయి. అభిప్రాయాల వ్యతిరేకతలలోని గమనక్రమానికి యిదే ఆధారం. ఇవే ఆలోచనాగమనానికి ప్రోద్బలం చేకూరుస్తాయి. మానవుని ఆలోచనలో ఉద్భవించే సమస్యలను నిరంతరం పరిష్కరిస్తూ వుంటాయి.

పార్టీలో ఆంతరంగికంగా విభిన్న సిద్ధాంతాలమధ్య వ్యతిరేకత, ఘర్షణలు ఎడతెగకుండా జరుగుతూ టాయి. అవి (వ్యతిరేక ఘర్షణలు) వర్గ వైరుధ్యాలకూ, సమాజంలో పాతవానికి కొత్తవానికి మధ్యవుండే వైరుధ్యాలకూ పార్టీలోపల యేర్పడే ప్రతిబింబాలు. పార్టీలో ఆంతరంగిక వైరుధ్యాలు లేకుండావుంటేనూ, వైరుధ్యాలను పరిష్కరించేందుకు సిద్ధాంత పోరాటాలు లేకుండావుంటేనూ పార్టీజీవితమే నశిస్తుంది.

ఈ విషయం యిప్పటికీ స్పష్టంగా వుంది. చలనము యొక్క సులభరూపాలలోగాని, జటిలరూపాలలోగాని, భౌతిక విషయాలు, సిద్ధాంత విషయాలలోగాని, అన్ని గతులలోను సర్వత్రా వైరుధ్యమనేది వుంటుంది. అయితే ప్రతిగమనం యొక్క ప్రాథమిక స్థాయిలోకూడా వైరుధ్యం వుంటుందా? మొదటినుండి చివరివరకూ ప్రతివిషయంయొక్క గతిక్రమంలోనూ వ్యతిరేకతలమధ్య చలనమనేది వుంటుందా?

డెబొరిన్‌వాదంపై తేబడిన సోవియట్ తత్వశాస్త్రజ్ఞుల విమర్శలనుండి ఒక విషయం ద్యోతకమవుతుంది. డెబొరిన్‌వాదం ఏవిషయంయొక్క గతిక్రమంలోనైనా ఆరంగంలోనే వైరుధ్యమనేది వుండదు; గతిక్రమం ఒకదశకు వచ్చినప్పుడుమాత్రమే వైరుధ్యం యేర్పడుతుంది. కనుక వైరుధ్యం యేర్పడే సమయంవరకు అంతర్గత కారణాలవల్లగాక, బాహ్యకారణాలవల్లనే పురోగమనం జరుగుతుంటుంది. ఈవిధంగా బాహ్యకారణాలు, యాంత్రికచలనం అనే భావవాద సిద్ధాంతం దగ్గరకే డెబొరిన్ తిరిగి చేరుకున్నాడు. నిర్దిష్టమైన సమస్యపరిశీలనకు యీ దృక్పథాన్నే వర్తింపజేస్తూ డెబొరిన్ వాదం సోవియట్ యూనియన్‌లో సాధారణంగా కులక్‌లు (ధనిక రైతులు), సామాన్య రైతులమధ్య విభేదాలు మాత్రమే వున్నవిగాని వైరుధ్యాలు లేవని అంటుంది. అంటే యీ డెబొరిన్ వాదం బుఖారిన్ దృక్పథంతో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నదన్నమాట. ఫ్రెంచి విప్లవాన్ని పరిశీలిస్తూ యీ డెబొరిన్ వాదం విప్లవానికిముందు కార్మికులు, రైతులు, బూర్జువా వర్గములతో కూడుకొనియున్న మూడవవర్గం (మూడవ ఎస్టేటు, థర్డ్ ఎస్టేటు) లో గూడా విభేదాలున్న వేగాని వైరుధ్యాలు లేవని చెబుతుంది. డెబొరిన్‌వాదంయొక్క యీ దృక్పథం మార్క్సిజానికి వ్యతిరేకం. ప్రపంచంలో ప్రతి విభేదంలోను వైరుధ్యం యిమిడే వుంటుందనీ, విభేదమే వైరుధ్యమనీ డెబొరిన్‌వాదం చూడలేకపోతున్నది. పెట్టుబడికి, శ్రమకు (Labour) మధ్య అవి ఏర్పడిననాటినుండీ వైరుధ్యం వుంటూనేవుంది. అయితే ఆరంభంలో ఆ వైరుధ్యం తీవ్రతచెందలేదు. సోవియట్

యూనియన్‌లోని సాంఘిక పరిస్థితులలోగూడా కార్మికులకు, రైతులకు మధ్య విభేదం వుంది - ఈ విభేదమే వైరుధ్యం - అయితే శ్రమకు, పెట్టుబడికి మధ్య వున్నదానిమాదిరిగా యీ వైరుధ్యం శతృత్వంలోకి వచ్చేలాగా తీవ్రతచెందదు. వర్గపోరాట రూపంలోకి రాదు: సోషలిస్టు నిర్మాణక్రమంలో కార్మికులు, రైతులు దృఢమైన మైత్రి నెలకొల్పుకొన్నారు. సోషలిజంనుండి కమ్యూనిజంవైపుకు పురోగమించే క్రమంలో యీవైరుధ్యాన్ని నెమ్మదిగా పరిష్కరించుకొంటారు. ఇది వైరుధ్యాలయొక్క స్వభావంలోని విభేదానికి సంబంధించిన సమస్యయేగాని, వైరుధ్యాలున్నవా, లేవా అనేదానికి సంబంధించిన సమస్య కాదు. వైరుధ్యం సర్వత్రా వుంది; అది సర్వసమగ్రమైయుంది. వస్తువులయొక్క అభివృద్ధిగతు లన్నిటిలోను వుంటుంది. అన్ని గతిక్రమాలలోను ఆద్యంతం పరుగిడుతూ వుంటుంది.

నూతన గతిక్రమం ఏర్పడటమంటే ఏమిటి? పాత సమైక్యత, దానిలోని వ్యతిరేకతల స్థానే నూతన సమైక్యత, నూతన అంతర్గత వ్యతిరేకతలు ఏర్పడుతుండటమే; పాతగతి క్రమం స్థానే నూతనగతిక్రమం ఏర్పడుతుండటమే; నూతన గతిక్రమం సంభవించడం; అప్పటికి పాతగతిక్రమం పూర్తయి నూతన గతిక్రమం ఏర్పడుతుందన్నమాట. నూతన గతి క్రమంలో తిరిగి నూతనవైరుధ్యం ఏర్పడియుంటుంది. ఇక యీ వైరుధ్యంయొక్క అభివృద్ధి చరిత్ర ప్రారంభమవుతుంది.

అన్ని విషయముల పురోగమన గతిక్రమంలోను మొదటి నుంచీ చివరివరకు గోచరించే వ్యతిరేకతల గమనం ఎలా వుంటుందో మార్క్సు తన 'కాపిటల్' అనే గ్రంథంలో వక

నమూనా పరిశీలన జరిపాడని లెనిన్ చెప్పాడు. అన్ని విషయాల పురోగమనక్రమాన్ని అధ్యయనంచేయటంలో అనుసరించవలసిన విధానం యిదే. లెనిన్ దీనిని ఖచ్చితంగా వర్ణింపచేశాడు.

తన 'కాపిటల్' అనే గ్రంథంలో మార్క్స్ అతి సామాన్యమైన, అతిసులభమైన, అతిముఖ్యమైన, అతిసాధారణమైన బూర్జువాసమాజ సంబంధాన్ని — అంటె, నిరంతరం అనుభవంలో ఎదుర్కొనే వస్తుమారక సంబంధం-ప్రథమంగా పరిశీలన జరిపాడు. ఈ సామాన్య విషయంలోనే (ఇదే బూర్జువా సమాజానికి జీవకణం) ఆధునిక సమాజంలోని అన్ని వైరుధ్యాలు (లేక వైరుధ్యాలవేళ్లు) వున్నాయనేది పరిశీలనద్వారా వెల్లడి అయింది. తరువాత జరిగిన వివరణ యీ సమాజంలోని యీ వైరుధ్యాలయొక్క పురోగమనాన్ని (అభివృద్ధి చలనం) మొదటి నుండి చివరివరకు తెలియజేస్తుంది. వ్యక్తిగత విభాగాల పరిణామం మొత్తం సమాజచరిత్రగా ఎలా రూపొందిందో స్పష్టం చేయబడింది.

ఇలా చెప్పినతర్వాత లెనిన్ "సాధారణంగా గతితార్కిక సూత్రాల అధ్యయనంపద్ధతి యిలావుండాలి" అనిఅన్నాడు.

చైనా కమ్యూనిస్టులు చైనా విప్లవ చరిత్రను, ప్రస్తుత పరిస్థితిని సరిగా పరిశీలించటానికి, ఆ విప్లవంయొక్క గమనాన్ని సరిగా అంచనా వేయడానికి ముందుగా యీ విధానాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలి.

## 3. వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వం

## (The Particularities of Contradiction)

వైరుధ్యం అన్ని విషయాల పురోగమన క్రమంలోను వుంటుంది. అంతేకాదు ఆ పురోగమనక్రమాన్ని మొదటినుంచి చివరివరకు పూసలలోని దారంవలె బంధిస్తుంది. ఇది మనం పైన చర్చించిన వైరుధ్యంయొక్క సర్వవ్యాపకత్వము, సర్వసమగ్రత్వమును. ఇప్పుడు మనం వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వము, సాపేక్షతనుగురించి చర్చిద్దాం.

ఈ సమస్యను వివిధ దృక్పథాలనుండి అధ్యయనం చేయవలసియుంటుంది. మొదటిది పదార్థ చలనంయొక్క ప్రతిరూపంలోని వైరుధ్యానికీ దాని ప్రత్యేకత్వముంది. పదార్థంయొక్క చలనరూపాల జ్ఞానమే మానవుని పదార్థజ్ఞానం; ఎందువల్లనంటే చలనంలోవున్న పదార్థం మినహా ప్రపంచంలో మరేమీ లేదు. పదార్థచలనం తప్పనిసరిగా కొన్ని రూపాలను కలిగియుంటుంది. పదార్థచలనంయొక్క ప్రతిరూపాన్నిగురించి మనం ఆలోచించేటప్పుడు చలనముయొక్క ప్రతి ఒక్క రూపము, చలనంయొక్క తదితరమైన అనేక రూపాలతోటి ఏయే విషయాలలో పోలిఉన్నవో మనం చూచుకోవాలి. అయితే ప్రత్యేకంగా ముఖ్యమైన విషయము అన్ని విషయాలలోను మన విజ్ఞానానికి ఆధారభూతమైనట్టిది ఒకటుంది. మనం పదార్థచలనంయొక్క ప్రత్యేక విషయాలను, అనగా, ఆరూపానికీ పదార్థంయొక్క తదితర రూపాలకు గల గుణవిభేదం దృష్టిలోకి తీసుకోవాలి. ఇది దృష్టిలోకి తీసుకున్నప్పుడే వస్తువుల మధ్య విచక్షణ చేయగలుగుతాం. చలనంయొక్క ఏరూప

మైనా తన ప్రత్యేక వైరుధ్యాన్ని తనలో కలిగియుంటుంది. ఈ ప్రత్యేకవైరుధ్యం ఒక వస్తువును తదితర వస్తువులనుండి వేరుపరచగలిగే ప్రత్యేకగుణం అవుతుంది. ప్రపంచంలోని వస్తువులు ఒకదానినుండి యింకొకటి వేయివిధాల భిన్నంగా వుంటాయనే విషయానికి యిదే అంతర్గతకారణము లేక ఆధారము. ప్రకృతిలో అనేక చలనరూపాలున్నాయి: యాంత్రికచలనం, ధ్వని, వెలుతురు, వేడి, విద్యుత్తు, పృథక్కరణము, సంలీనము వగైరాలు అలాంటివే. పదార్థచలనంయొక్క యీరూపాలన్నీ ఒకదానిమీద ఒకటి ఆధారపడి వున్నవి. అదేసమయంలో గుణంలో ఒకదానినుండి ఒకటి భిన్నమైవున్నవి. పదార్థచలనం యొక్క ప్రతిరూపానికి వున్న ప్రత్యేకగుణము దాని ప్రత్యేక వైరుధ్యంచేతనే నిర్ణయించబడుతున్నది. ఈ పరిస్థితి ఒక్క ప్రకృతిలోనేగాక, సాంఘిక, సిద్ధాంత విషయాలలోగూడా వున్నది. ప్రతి సామాజికరూపము ప్రతి ఆలోచనా విధానము తన ప్రత్యేక వైరుధ్యాన్ని, ప్రత్యేక గుణాన్ని కలిగియున్నది.

శాస్త్రాధ్యయనంయొక్క వివరణ యావత్తూ సర్గా వస్తువుల్లో యిమిడియున్న ప్రత్యేక వైరుధ్యాలపైనే ఆధారపడియుంది. ఆ విధంగా ఒక రకమైన వస్తువుకు ప్రత్యేకంగాయున్న ఒకరకమైన వైరుధ్యం ఒక రకమైన శాస్త్రశాఖను అధ్యయనం చేయటానికి మూలాధారంగా యుంటుంది. ఉదాహరణకు గణితశాస్త్రంలో అనుకూల సంఖ్యలు, ప్రతికూల సంఖ్యలు, యంత్రశాస్త్రంలో చర్య, ప్రతిచర్య (Action and Reaction) పదార్థ విజ్ఞానశాస్త్రంలో (Physics) పాజిటివ్, నెగిటివ్ విద్యుత్, రసాయనశాస్త్రంలో పృథక్కరణము, సంలీనము

(Decomposition: Combination), సాంఘిక శాస్త్రంలో ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తిసంబంధాలు, మరియు, వర్గాలు, వర్గ పోరాటము, సైనికశాస్త్రంలో దాడి, స్వీయరక్షణ, తత్వ శాస్త్రంలో భావవాదము, భౌతికవాదము, మరియు సాధారణ తర్కము, గణితతర్కము - వగైరా లన్నిటిలోను ప్రతి ఒక్కటి ఒకప్రత్యేక వైరుధ్యాన్ని, ప్రత్యేకగుణాన్ని కలిగివున్నది; ఇవన్నీ వివిధరకాల శాస్త్రీయాధ్యయనానికి విషయాలుగా వున్నవి. అయితే వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని గుర్తించకపోతే వస్తువుల చలనంయొక్క అభివృద్ధికి సర్వాధారము, సర్వకారణము అయినదానిని యేవిధంగాను మనం కనిపెట్టలేము. అలాగే మనం వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని పరిశీలించక పోతే, యితర వస్తువులనుండి విభేదించే ఒక వస్తువుయొక్క ప్రత్యేకగుణాన్ని మన మే విధంగానూ నిర్ధారణ చేయలేము. వస్తువుల చలనంయొక్క అభివృద్ధికిగల ప్రత్యేక కారణాన్నిగాని, ప్రత్యేకాధికారాన్నిగాని కనిపెట్టలేము. వస్తువులను విచక్షణ గావించి శాస్త్రీయ అధ్యయనానికి రంగాలను తేల్చలేము.

మానవునియొక్క అవగాహనా గతిక్రమం ఎల్లప్పుడూ వ్యక్తిగత విషయాలను అవగాహన చేసుకొనేదశనుండి సాధారణంగా వుండే వస్తువులను అవగాహన చేసుకొనే దశలోకి క్రమేణా విస్తృతమవుతుంది. మానవుడు అనేక విభిన్నవస్తువుల ప్రత్యేకగుణాలను అర్థం చేసుకున్న తర్వాతనే, అనేక వస్తువుల సాధారణగుణాలను తెలుసుకోగలగటము, వాటిని సిద్ధాంతీకరించేవైపుకు పోగలగటము జరుగుతుంది. ఇలాంటి సాధారణ గుణాలను తెలుసుకొని వుంటేనే, ఆ విజ్ఞానాన్ని మార్గదర్శ

కంగా పెట్టుకొని అప్పటికింకా అధ్యయనం చేయనటువంటి, లేదా క్షుణ్ణంగా అధ్యయనం చేయనటువంటి అనేక నిర్దిష్టమైన వస్తువులను, వాటియొక్క ప్రత్యేకగుణాలను తెలుసుకొనేందుకు అధ్యయనం చేయటానికి పూనుకొంటాడు. ఆ విధంగామాత్రమే సాధారణగుణాలకు సంబంధించిన తన అవగాహనను అభివృద్ధి పరచుకోటం, మెరుగుపెట్టటం చేయగలుగుతాడు; ఆ అవగాహన మొద్దుబారి వికలమైపోకుండా ఆపగలుగుతాడు. అర్థం చేసుకోటానికి సంబంధించిన గతిక్రమాలు యీ రెండు. ఒకటి ప్రత్యేకత్వంనుండి సాధారణత్వంవరకు; రెండవది సాధారణత్వంనుండి ప్రత్యేకత్వంవరకు. మానవుని అవగాహనాశక్తి ఎల్లప్పుడూ యీ విధమైన వలయంలో చక్రీతత్వంగా జరిగిపోతూ వుంటుంది. వలయం ఏర్పడినప్పుడల్లా (అది ఖచ్చితంగా శాస్త్రీయపద్ధతి ననుసరించి వుంటే) అది మానవుని విజ్ఞానాన్ని పై అంతస్థులోకి తీసుకుపోతూ నిరవధికంగా మెరుగు పెడుతుంది. ఈ సమస్యపై మన ఛాందసుల పొరపాటేమంటే, ఒకవైపున (మనం వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని అధ్యయనం గావించి, వ్యక్తిగత వస్తువుల ప్రత్యేక గుణాలను) వైరుధ్యం యొక్క విశ్వవ్యాపకత్వాన్ని, వివిధ వస్తువుల సామాన్య గుణాలను అర్థం చేసుకొనేముందే మనం వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని అధ్యయనం గావించి వ్యక్తిగత వస్తువుల ప్రత్యేక గుణాలను తెలుసుకోవాలనే విషయాన్ని వారు గమనించటం లేదు. రెండోవైపు, వస్తువుల సామాన్య గుణాలను అర్థం చేసుకొన్నతర్వాత సంపూర్ణంగా అధ్యయనం చేయనటువంటి లేక నూతనంగా ఆవిర్భవించినటువంటి నిర్దిష్టమైన వస్తువులను

అధ్యయనం చేస్తూవుండాలనే విషయాన్ని వారు గమనించటం లేరు. మన ఛాందసులు చచ్చు పీనుగులు; నిర్దిష్టమైన వస్తువులను నరుం వంచి శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేయటానికి వారు తిరస్కరిస్తారు. పైగా సాధారణ సత్యాలను (General Truths) శూన్యంనుండి ఉద్భవించినవిగా పరిగణించి వాటిని ప్రజలు గ్రహించలేని అనిర్దిష్టమైన (Abstract) సూత్రాలక్రిందకు మార్చివేస్తారు. ఆవిధంగా మానవులు సత్యాన్ని గ్రహించే మామూలుపద్ధతిని ధిక్కరించి దాన్ని తలక్రిందులు చేస్తారు. ప్రత్యేకత్వంనుండి సాధారణత్వానికి, సాధారణత్వంనుండి ప్రత్యేకత్వానికి, విజ్ఞాన సముపార్జనలోని యీ రెండు విధానాల మధ్య వుండే సంబంధాన్ని వారు అర్థం చేసుకోటంలేరు. వారు విజ్ఞానాన్నిగురించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అర్థం చేసుకోటంలేరు.

పదార్థ చలనరూపాలయొక్క ప్రతి గొప్పవర్గంలోని ప్రత్యేక వైరుధ్యాన్ని, తత్ఫలితంగా నిర్ణయించబడే గుణమును అధ్యయనం చేయటం అవసరం. అంతమాత్రమేగాక ప్రత్యేక వైరుధ్యాన్ని, పదార్థంయొక్క దీర్ఘపరిణామక్రమంలోని ప్రతి దశలోను దాని ప్రతి చలనరూపంలోని గుణాన్ని అధ్యయనం చేయటంకూడాఅవసరం. అన్నిచలనరూపాలలోను ఊహామాత్రమైనదిగాక యథార్థమైన ప్రతి పరిణామక్రమము గుణంలో భేదించియుంటుంది. మన అధ్యయనం ఈ విషయంమీదనే కేంద్రీకరించి దానినుండే మనం ఆరంభించాలి.

గుణరీత్యా భిన్నమైన వైరుధ్యాలు, గుణరీత్యా భిన్నమైన పద్ధతులద్వారామాత్రమే పరిష్కరించబడగలుగుతాయి.

ఉదాహరణకు: కార్మికవర్గానికి, బూర్జువావర్గానికి మధ్యవున్న వైరుధ్యం సోషలిస్టు విప్లవపద్ధతిలో పరిష్కరించబడింది; అశేష ప్రజాబాహుళ్యానికి, ఫ్యూడల్ వ్యవస్థకు మధ్యవున్న వైరుధ్యం ప్రజాతంత్ర విప్లవపద్ధతిలో పరిష్కరించబడింది. వలసదేశాలకు, సామ్రాజ్యవాదానికి మధ్యవున్న వైరుధ్యం జాతీయ విప్లవ పోరాటపద్ధతిద్వారా పరిష్కరించబడింది; సోషలిస్టుసమాజంలో కార్మికవర్గానికి, రైతాంగానికి మధ్యవున్న వైరుధ్యం సమిష్టి, యంత్ర,వ్యవసాయపద్ధతిద్వారా పరిష్కరించబడింది; కమ్యూనిస్టు పార్టీలో అంతరంగికంగావుండే వైరుధ్యం విమర్శ - ఆత్మవిమర్శ అనే పద్ధతిద్వారా పరిష్కరించబడుతుంది; సమాజము, ప్రకృతి మధ్యవున్న వైరుధ్యం ఉత్పత్తిశక్తులను అభివృద్ధిచెందించుట ద్వారా పరిష్కరించబడుతుంది. గతులు మారుతుంటాయి; పాతగతిక్రమాలు అంతర్ధానమై నూతనగతిక్రమాలు, నూతన వైరుధ్యాలు పుట్టుకొస్తుంటాయి; ఆ వైరుధ్యాలను పరిష్కరించే పద్ధతులుగూడా తదనుగుణ్యంగానే భేదిస్తుంటాయి. రష్యాలో ఫిబ్రవరి విప్లవంద్వారా పరిష్కరించబడిన వైరుధ్యాలు, అక్టోబరు విప్లవంద్వారా పరిష్కరించబడిన వైరుధ్యాలు, అలాగే ఆ పరిష్కారాల కుపయోగించబడిన విధానాలు ప్రాథమికంగా భిన్నమైనట్టివి. భిన్నమైన వైరుధ్యాలను పరిష్కరించటానికి భిన్నమైన పద్ధతులను వినియోగించటమనేది మార్క్సిస్టు - లెనినిస్టులు తూచాతప్పకుండా అనుసరించాల్సిన సూత్రం. ఛాందసులు ఈ సూత్రాన్ని పాటించరు. వారు వివిధ విప్లవకరపరిస్థితుల లోని విభేదాలను అవగాహనచేసుకోరు; తత్పర్యవసానంగా భిన్నవైరుధ్యాలను పరిష్కరించటానికి భిన్నపద్ధతులను అను

సరించాల్సివస్తుందని గ్రహించక, మార్చటానికి వీలు లేనివిగా ఊహాగానంచేసి సర్వత్రా ఒకే సూత్రాన్ని పాటించి దానినే ప్రతిచోటా మొద్దుగా వర్తింపజేస్తారు. ఇది విప్లవానికి ప్రతి బంధకాలను కల్పించటంమాత్రమేగాక, సక్రమంగా పరిష్కృతమయ్యేదాన్ని పెద్ద గందరగోళంలోకి యీడుస్తుంది.

వస్తువుల అభివృద్ధిక్రమంలో వైరుధ్యాల మధ్య వుండే అంతస్సంబంధాన్ని, ఆ వైరుధ్యాల ప్రత్యేకత్వాన్ని బహిర్గతం చేయాలంటే, అనగా, వస్తువుల అభివృద్ధిక్రమంయొక్క గుణాన్ని బహిర్గతంచేయాలంటే అట్టి అభివృద్ధిక్రమంలోని వైరుధ్యంయొక్క ప్రతి అంశపు (Aspect) ప్రత్యేకత్వాన్ని మనం బహిర్గతం చేయాల్సిఉంటుంది; లేకపోతే అభివృద్ధి క్రమంయొక్క గుణాన్ని బహిర్గతమొనర్చటం అసాధ్యమవుతుంది. మన అధ్యయనంలో అత్యంత శ్రద్ధను చూపించవలసిన విషయంకూడా యిదే.

ఒక గొప్ప విషయంగాని, ఘటనగాని దాని అభివృద్ధి క్రమంలో చాలా వైరుధ్యాలతో కూడుకొని ఉంటుంది. ఉదాహరణకు, చైనా బూర్జువా ప్రజాతంత్ర విప్లవక్రమంలో చైనా సమాజంలోని దోపిడీ చేయబడే వివిధ వర్గాలకు, సామ్రాజ్యవాదానికి మధ్య వైరుధ్యం వుంది, అశేష ప్రజాబాహుళ్యానికి ఫ్యూడలిజానికి మధ్య వైరుధ్యం వుంది, కార్మిక వర్గానికి బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యం వుంది. ఒకవైపు బస్తీలలోని పెటీబూర్జువాతోసహా రైతాంగానికి, రెండవవైపు బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యం వుంది. వివిధ అభివృద్ధి నిరోధక పాలకవర్గాలమధ్య వైరుధ్యంవుంది. ఈ అన్ని సంద

ర్యాలలోను పరిస్థితి అత్యంత క్లిష్టంగా ఉంటుంది. ఈ అన్ని వైరుధ్యాలలోను ప్రతిదీ తన ప్రత్యేకత్వాన్ని కలిగియుండి, అన్నీ ఒకేరకంగా భావించబడటానికి వీలులేకుండా వున్నాయి. అంతేగాక, ప్రతివైరుధ్యంయొక్క రెండు అంశాలు గూడా తన తన ప్రత్యేక గుణాలను కలిగియుండి, ఒకేరకంగా భావించబడటానికి వీలులేదు; చైనావిప్లవం కొరకు కృషిచేసే మనం చేయవలసినది, వైరుధ్యాలను మొత్తంగా, అంటే ఈ వైరుధ్యాల అతస్సంబంధం దృష్ట్యా ప్రతివైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని అర్థంచేసుకోటం మాత్రమేకాదు. వైరుధ్యాల యొక్క అన్ని అంశాల (aspects)ను అధ్యయనం చేయటానికి పూనుకోటంద్వారా వైరుధ్యాల సర్వస్వాన్ని (Totality) అర్థంచేసుకోగలుగుతాం. వైరుధ్యంయొక్క అంశాల్లో (aspects) ప్రతిదాన్ని అర్థంచేసుకోటమంటే ప్రతిఅంశము ఖచ్చితంగా ఆక్రమించియుండే స్థానాన్ని తెలుసుకోటమే; ప్రతి అంశము తన వ్యతిరేక శక్తితో పరస్పరాధారము, వైరుధ్యము అనే సంబంధంలోకి ఏ నిర్దిష్టమైన రూపంలో వస్తుందో తెలుసుకోటమే; ప్రతిఅంశమూ, దాని వ్యతిరేకశక్తీ — యీ రెండూ విరుద్ధంగా వుంటూనే పరస్పరాధారంగా యున్నప్పుడు, పరస్పరాధారం విచ్ఛిన్నమైనప్పుడు ప్రతి అంశము తన వ్యతిరేక శక్తితో ఘర్షణపడే నిర్దిష్టమైన పద్ధతులను తెలుసుకోటమే. ఈ సమస్యలను అధ్యయనం చేయుటం అత్యంత ప్రధానమైన విషయం. మార్క్సిజంలో అత్యంత ప్రధానమైన విషయము, మార్క్సిజానికి జీవగర్ర అయినది

నిర్దిష్టమైన పరిస్థితులను నిర్దిష్టంగా అనుశీలన చేయటమే నని ♦ చెప్పటంద్వారా లెనిన్‌కూడా యిదే భావాన్ని వ్యక్తపరచాడు. లెనిన్ బోధనకు భిన్నంగా మన ఛాందసులు ఏ విషయాన్నైనా నిర్దిష్టంగా అనుశీలన జరిపేందుకు తమ బుర్రలను ఏనాడూ వినియోగించరు; తమ వ్రాతల్లోను, ఉపన్యాసాల్లోను ఏమాత్రమూ పసలేని "ఎనిమిది పాదాల వ్యాసం" నినాదాన్ని లేవనెత్తుతుంటారు; ఈ విధంగా మన పార్టీపనిలో అతి దుష్టమైన ఒక విధానాన్ని ప్రవేశపెట్టారు.

ఒక సమస్యను మనం పరిశీలించే సందర్భంలో వ్యూహాజనితమైన ఆలోచనకు, పాక్షికత్వానికి, పైపైన తేల్చివేసే విధానానికి తావులేకుండా జాగ్రత్తవహించాలి. ఊహాజనితమైన ఆలోచన అనగా ఒక సమస్యను దాని యదార్థ పరిస్థితి దృష్ట్యా పరిశీలించకపోవటం అనగా భౌతికవాద దృష్ట్యా చూడకపోవటం అవుతుంది. 'ఆచరణ' అనే నా వ్యాసంలో యీ విషయాన్ని చర్చించాను. పాక్షికత్వమనేది ఒక సమస్యను మొత్తంగా చూడకపోవటంలో యిమిడి వుంది. ఉదహారణకు : జపానును వదలి చైనాను మాత్రమే అవగాహన చేసుకోటం; కొమింటాంగును వదలి కమ్యూనిస్టుపార్టీని మాత్రమే అవగాహన చేసుకోటం; బూర్జువావర్గాన్ని వదలి కార్మికవర్గాన్ని మాత్రమే

---

♦ లెనిన్ తన 'కమ్యూనిజం' అనే వ్యాసంలో హంగేరియన్ కమ్యూనిస్టు బేలాకున్‌ను విమర్శిస్తూ యిలా అన్నాడు: "ఆయన (బేలాకున్) మార్క్సిజంలో అత్యంత ప్రధానమైన విషయము, మార్క్సిజానికి జీవగర్రయైనట్టిది, అనగా నిర్దిష్టమైన పరిస్థితులను నిర్దిష్టంగా అనుశీలన చేయటాన్ని' వదిలివేసాడు."

అనువాదకుడు :— అవగాహన చేసుకోటమనగా గణనలోనికితీసుకోటం.

అవగాహన చేసుకోటం; భూస్వాములను వదలి రైతాంగాన్ని మాత్రమే అవగాహన చేసుకోటం; మనకు ప్రతికూలమైన పరిస్థితులను వదలి మన కనుకూలమైన పరిస్థితులను మాత్రమే అవగాహన చేసుకోటం; భవిష్యత్తును వదలి గతాన్ని మాత్రమే అర్థంచేసుకోటం; మొత్తాన్ని వదలి భాగాన్నిమాత్రమే అవగాహన చేసుకోటం; మన విజయాలను వదలి, మన లోపాలను మాత్రమే అవగాహన చేసుకోటం; ప్రతివాదిని వదలి వాదిని మాత్రమే అవగాహన చేసుకోటం; బహిరంగ విప్లవ కార్యక్రమాన్ని వదలి రహస్యవిప్లవ కృషినే అవగాహన చేసుకోటం ఇదేవరస. ఒక్కమాటలో చెప్పాలంటే ఒక వైరుధ్యానికివుండే ప్రతిఅంశంయొక్క గుణాలను పరిగణించకపోవటం. ఒకసమస్యను పాక్షికంగా చూడటమని దీన్నే అంటాం. దీన్నే మొత్తాన్ని చూడకుండా భాగాన్ని మాత్రమే చూడటమని, కొయ్యను చూడకుండా చెట్లను మాత్రమే చూడటమనికూడ అనవచ్చు. దీనిఫలితంగా వైరుధ్యాలను పరిష్కరించేందుకు మార్గాలను అన్వేషించటం అసాధ్యమైపోతుంది; విప్లవకర్తవ్యాలను నెరవేర్చటం అసాధ్యం; మనకు నిర్ణ్యక్తమైన పనిని బాగాచేయటం గూడా అసాధ్యం; పార్టీలో సిద్ధాంతపోరాటాన్ని వృద్ధిపర్చటం గూడా అసాధ్యమే. మిలిటరీ శాస్త్రాన్ని చర్చిస్తూ "సన్‌సు" యిలా అన్నారు: "శత్రువును తెలుసుకొని నిన్ను నీవు తెలుసుకొంటే పరాజయంలేకుండా నూరు పోరాటాలను చేయగలుగుతావు" ♦ రణరంగంలోని యిరుపక్షాలను ఉద్దేశించే ఆయన

♦ సన్‌సు వ్రాసిన 'సన్‌సు' అనే గ్రంథంనుండి యిది వుదహరించబడింది. ఈయన క్రీ. పూ. 5 వ శతాబ్దిలోవాడు. ఈయన్ను సన్‌వు లేక సన్‌వుసు అనిగూడా పిలుస్తారు. మిలిటరీ శాస్త్రము, వ్యూహములలో దిట్టరి.

ఖ్యో మాటలు చెప్పారు. టాంగ్ కుటుంబానికి చెందిన వైచెంగ్ యిలా అన్నాడు. “ఇరుపక్షాలను ఆలకించటం వలన విషయం నీకు సుబోధక మవుతుంది; ఒకపక్షాన్నే వినటంవలన నీవు అంధకారంలో పడతావు. * పాక్షికత్వం తప్పు గూడా ఆయన అర్థంచేసుకున్నాడు. అయినప్పటికీ, సమస్యలను పరిశీలించే టప్పుడు మన కామ్రేడ్స్ తరుచు పాక్షికత్వంవైపు మొగ్గుతూ వుంటారు. అటువంటివారికి చిక్కు లెదురవుతుంటాయి. ♦ ‘నీటి హద్దు’ అనే గ్రంథంలో సంగ్ చియాంగ్ ‘చూ’ అనే గ్రామంపై మూడు దాడులు నడిపాడు. కాని పరిస్థితులను గురించి సక్రమమైన అవగాహన లేక తప్పుడు పద్ధతులను అనుసరించటంవలన రెండు పర్యాయములు వోడిపోయాడు. తర్వాత తన విధానమును మార్చుకొని పరిస్థితిని పరిశోధించ టంతో ప్రారంభించాడు: ఆ విధంగా జములుగా వక రోడ్డు వుండటాన్ని గ్రహించి, లీ, హు, చూ గ్రామాల సంబంధాన్ని

* 618-906 వైచెంగ్ (580-643. వాడు టాంగ్ వంశ ఆరంభంలో వున్న రాజకీయవేత్త, చరిత్రకారుడు. ఈవ్యాఖ్య సంగ్ వంశ కాలం (960-1276)లో సుమాకంగ్ చేకూర్చబడిన ప్రఖ్యాతివహించిన పురాతన చైనా పత్రిక సంచికలోనిది.

♦ నీటిహద్దు అనే గ్రంథం యూవాను, మింగ్ రాజవంశాల మధ్య కాలమైన 14 వ శతాబ్దంలో వుంటూవుండిన ‘నాయన్’ అనే అతను రచించా డని చెప్పబడే ఒక గొప్ప చైనీయ నవలాగ్రంథం. ఈ నవలలో సంగ్ వంశ కాలంలో సంగ్ చియాంగ్ చే నడపబడిన రైతాంగ విప్లవ పోరాటాన్ని గురించి చెప్పబడింది. చూ అనే గ్రామం పాలకవర్గాలకు వ్యతిరేకంగా సంగ్ చియాంగ్ నడిపిన విప్లవపోరాటానికి ముఖ్యస్థావరమైన లియాంగ్ షాంపోకు పరిసరంలో వున్నది.

తెగగొట్టి విదేశీకథల్లో చెప్పబడిన ట్రోజాన్ గుర్రముమాదిరి వ్యూహాన్ని వుపయోగించటంద్వారా మారు వేషాలతో తన సైనికులను రహస్యంగా శత్రుశిబిరంలోకి చొప్పించి మూడవ పర్యాయం విజయం సాధించాడు. ఈ 'నీటిహద్దు' (Water Margin) అనే గ్రంథంలో భౌతికవాద గతితార్కిక సూత్రా లకు సరిపోయే వుదాహరణలు ఎన్నో వున్నాయి. అందులో 'చూ' గ్రామంపై నడుపబడిన మూడుదాడుల గాధ అన్నిటికంటే మంచి వుదాహరణగా పరిగణించబడుతున్నది. లెనిన్ యిలా అన్నాడు: ఒక విషయాన్నిగాని వస్తు వునుగాని మనం సక్రమంగా తెలుసుకోవాలంటే దాన్ని మొత్తంగా ఆకళింపు చేసుకోవాలి, దాని అన్ని అంశాలను అన్ని బంధాలను, ఆ బంధాలను కలిపే లంకెను అధ్యయనం చేసితీరాలి. అయితే సర్వ సమగ్రంగా మన మెప్పుడూ యిది చేయలేం., కాని అన్నినైపులనుండి పరిశీలించాలి అనే నినాదం పొరపాట్లు జరగకుండా, మొండిగా వుండకుండా (Rigility) కాపాడుతుంది. లెనిన్ యొక్క ఈ మాటలను మనం ఎప్పుడూ జ్ఞాపక ముంచుకోవాలి. పైపైన పరిశీలించే (Superficiality) విధాన మనగా మొత్తం వైరుధ్యానికివున్న లక్షణాలనుగాని, లేక వైరుధ్యంయొక్క ప్రతి అంశానికివుండే లక్షణాలనుగాని పరిగణించక పోవటము, వైరుధ్యంయొక్క లక్షణాలను సునిశి తంగా అధ్యయనం చేయటానికిగాను వస్తువులలోకి చొచ్చుకు పోవలసిన అవసరాన్ని తిరస్కరించటము, మరియు దూరా న్నుంచే వైరుధ్యాన్ని ఒక్కసారిచూచి, దాని కొన్ని అంశా లను చెదురుగా గుర్తించి దాన్ని పరిష్కరించటానికి (ప్రశ్నలకు

జవాబు చెబుతూ, విభేదాలను సరిపెడుతూ పనిలో చేయి చేసుకుంటూ, మిలిటరీ చర్యలను ఆదేశిస్తూ) పూనుకోటం. ఈ విధంగా చేయటం చిక్కుల్లోకి దారి తీస్తుందేగాని మరొకటికాదు. ఛాందసము, తనకోటిదేలోకం [ (Empiricism) తన అనుభవమే ఆధారంగా ప్రపంచానుభవాన్ని పరిగణించటం] అనే వ్యాధులతో బాధపడే మనకామ్రేడ్స్ తప్పులు చేయటం ఎందువల్లనంటే సరిగ్గా వారు వస్తువులను పరిశీలించే విధానం, స్వకీయాత్మకము, పాక్షికము, పైపైన తేల్చివేయటము అయినందువల్లనే. పాక్షికము, పైపైన తేల్చివేయటములుగూడా స్వకీయాత్మకములే. ఎందువల్లనంటే, యదార్థవిషయాలన్నీ వాస్తవంలో అంతస్సంబంధములో యుండి ఆంతరంగికావశ్యకతను కలిగియుండగా, కొంతమంది యీ పరిస్థితులను వున్నవి వున్నట్లుగా ప్రతిబింబింపక వాటి అంతస్సంబంధాన్ని, వాటి ఆంతరంగిక ఆవశ్యకతను అర్థంచేసుకోకుండా కేవలం పాక్షికదృష్టితో చూస్తారు లేదా పైపైనే తేలగొడతారు. అందువల్లనే యిట్టి విధానం స్వకీయాత్మక మవుతుంది.

వస్తువుల అభివృద్ధిగతిక్రమం మొత్తంలోయున్న వ్యతిరేక శక్తుల చలనం (అంతస్సంబంధంలోను, దాని వివిధ అంశాల పరిస్థితులలోను) మనదృష్టిని నిలపవలసిన తన స్వంతలక్షణాలను కలిగియుంటుంది. అంతేగాక, అభివృద్ధి గతిక్రమంలోని ప్రతిదశగూడా మనదృష్టిని నిలపవలసిన తన స్వంతలక్షణాలను కలిగి యుంటుంది.

వస్తువుల అభివృద్ధిగతిక్రమంలోని ప్రధానమైన వైరుధ్యమూ, యీ ప్రధాన వైరుధ్యంచే నిర్ధారించబడే ఆ గతిక్రమం

యొక్క గుణము, ఆ గతిక్రమం పూర్తయేవరకు అదృశ్యమై పోవు; కానివస్తువుల అభివృద్ధియొక్క దీర్ఘమైన గతిక్రమంలోని ప్రతిదశయొక్కపరిస్థితులు మరోదశయొక్కపరిస్థితులతో తరచు భేదిస్తూ వుంటాయి. ఇది ఎందువల్లననగా, వస్తువుల అభివృద్ధి గతిక్రమంలోని ప్రధాన వైరుధ్యంయొక్క నైజము మరియు గతిక్రమంయొక్క గుణము మార్పు చెందక పోయినప్పటికి అభివృద్ధియొక్క దీర్ఘ గతిక్రమంలో వివిధదశల యందు ప్రధానమైన వైరుధ్యం పెంపుదలతోగూడిన గాఢమైన రూపాన్ని పొందుతూవుంటుంది. అంతేగాక, ప్రధానవైరుధ్యంచే నిర్ణయించబడి ప్రభావంపొందే అనేక పెద్ద, చిన్న వైరుధ్యాలలో కొన్ని యింకా గాఢతరమవుతాయి. కొన్ని తాత్కాలికంగానో లేక పాక్షికంగానో పరిష్కరించబడతాయి లేక రద్దుకాబడతాయి. మరికొన్ని క్రొత్తగా పుట్టుకొస్తాయి; పర్యవసానంగా అభివృద్ధి గతిక్రమం తనలో విభిన్నదశలు యిమిడీయున్నట్లు తనే బహిర్గతం చేసుకొంటుంది. ప్రజలు గనక ఒక వస్తువుయొక్క అభివృద్ధి గతిక్రమంలోని దశలయెడల శ్రద్ధచూపకపోతే వారు దాని వైరుధ్యాలతో సరిగా వ్యవహరించలేరు.

ఉదాహరణకు: స్వేచ్ఛా పోటీ శకంలోని పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా వృద్ధి చెందినకాలంలో ప్రముఖ వైరుధ్యంలోయున్న కార్మికులు, బూర్జువా అనే రెండువర్గాల స్వభావంలోగాని, అట్టి సమాజంయొక్క పెట్టుబడిదారీ విధానపు నైజములోగాని మార్పేమీలేదు; అయినప్పటికీ, యీ రెండువర్గాలమధ్య వైరుధ్యము గాఢతరమయింది; గుత్తపెట్టు

బడికి, గుత్తిస్వభావంలేని పెట్టుబడికి మధ్య వైరుధ్యం పుట్టుకొచ్చింది; పెత్తందారీదేశాలకు (Metropolitan Countries) వలసదేశాలకు మధ్య వైరుధ్యం తీవ్రమయింది; మరియు పెట్టుబడిదారీదేశాలమధ్య వైరుధ్యం, అనగా వాటి అభివృద్ధియొక్క హెచ్చు తగ్గులవల్ల సంభవించిన వైరుధ్యము ప్రత్యేకంగా తీవ్రమైన స్థాయిలో ప్రదర్శితమయింది; ఆ విధంగా పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రత్యేకదశయైన సామ్రాజ్యవాదం కొనసాగబడింది. లెనినిజమనేది సామ్రాజ్యవాదపు, కార్మికవర్గ విప్లవ శకంయొక్క మార్క్సిజము అనేదానికి కారణం లెనిన్ స్టాలిన్లు యీ వైరుధ్యాలను సరిగ్గా విశదీకరించి, వాటిని పరిష్కరించేందుకుగాను కార్మికవర్గ విప్లవ ఎత్తుగడలను, సిద్ధాంతాన్ని సరిగ్గా ఏర్పరచారు గనుకనే.

1911 విప్లవంతో ప్రారంభమయిన చైనా బూర్జువా ప్రజాతంత్ర విప్లవగతిని పరిశీలిస్తేగూడా కొన్ని ప్రత్యేకదశలున్నట్లు బయటపడుతుంది. ప్రత్యేకంగా, బూర్జువా నాయకత్వకాలంలోని విప్లవము, కార్మికవర్గ నాయకత్వకాలంలోని విప్లవము యీ రెండూ పెద్దగా విభిన్నమైన చారిత్రకదశలుగా ప్రత్యేకించబడ్డాయి. అంటే, కార్మికవర్గ నాయకత్వం విప్లవంయొక్క అంగనిర్మాణాన్నే ప్రధానంగా మార్చివేసి వర్గ సంబంధాలలో పునః సర్దుబాటుకు, రైతాంగ విప్లవానికి బ్రహ్మాండమైన వూపుకు, సామ్రాజ్య వ్యతిరేక ఫ్యూడల్ వ్యతిరేక విప్లవంలో పగడ్బందీకి, ప్రజాతంత్ర విప్లవంనుండి సోషలిస్టు విప్లవానికి చేరిపోయే అవకాశాన్ని దారితీసింది. విప్లవం బూర్జువా నాయకత్వంక్రింద వున్నకాలంలో యివన్నీ

జరగటానికి అవకాశంలేదు. విప్లవగతి మొత్తంమీద ప్రధాన వైరుధ్యంయొక్క స్వభావంలోనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక, ప్రజాతంత్ర విప్లవ స్వభావంలోనూ, (అర్ధవలస, అర్ధఫ్యూడల్ స్వభావం మరో అంగంగా) మార్పేమీ లేదు. ఐనప్పటికీ, 1911 విప్లవం పరాజయంగాంచి ఉత్తర ప్రాంతపు యుద్ధ ప్రభువుల (Warlords) పాలన నెల కొల్పబడటం, ప్రథమ జాతీయ ఐక్యసంఘటన నెలకొల్పబడ టము, 1924–27 విప్లవము, ఐక్యసంఘటన విచ్ఛిన్నమై బూర్జువాజీ విప్లవ వ్యతిరేక శిబిరంలోకి చేరిపోవటము, నూతన యుద్ధప్రభువులమధ్య యుద్ధాలు జరగటం, వ్యవసాయక విప్లవ యుద్ధము, రెండవ జాతీయ ఐక్యసంఘటన నెలకొల్పబడటము, జపాను వ్యతిరేకయుద్ధం– మొదలైన ప్రధాన ఘట్టాల దీర్ఘ కాలంలో వచ్చిన యిరువదిసంవత్సరాల వ్యవధిలోని విప్లవ గతిక్రమం అనేకదశలలో పరిణామం చెందింది; ఈ దశలలో యిమిడియున్న నిర్దిష్టమైన పరిస్థితు లివి: కొన్ని వైరుధ్యాలు తీవ్రతరమవటం (ఉదాహరణకు వ్యవసాయక విప్లవయుద్ధము, నాల్గు ఉత్తరరాష్ట్రాలపైకి జపాను ఆక్రమణదాడి); ఇతర వైరు ధ్యాలు పాక్షికంగాను, తాత్కాలికంగాను పరిష్కరించబడటం (ఉదాహరణకు ఉత్తరప్రాంతపు యుద్ధప్రభువులనురద్దుచేసి వారి భూములను మనం స్వాధీనం చేసుకోటం); యింకా యితర వైరుధ్యాలు క్రొత్తగావుత్పన్నమవటం (ఉదాహరణకు నూతన యుద్ధ ప్రభువులమధ్య పోరాటము, మనము దక్షిణాదిన మన విప్లవ స్థావరాలను కోల్పోయినపిమ్మట భూస్వాములు తమ భూమిని తిరిగీ సాధించుకోవటం).

వస్తువులయొక్క అభివృద్ధి గతిక్రమంలో ప్రతిదశయందు వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వాన్ని అధ్యయనం చేయటానికి మనం వాటిని మొత్తంగాను, వాటి అంతస్సంబంధాన్ని గమనించవలసి వుంటుంది. అంతేకాక, వైరుధ్యంయొక్క పరిణామంలో ప్రతిదశయందు దాని ప్రతి అంశాన్ని పరిగణించవలసి యుంటుంది.

ఉదహరణకు కొమింటాంగును, కమ్యూనిస్టుపార్టీని తీసుకోండి. కొమింటాంగు ప్రథమ ఐక్యసంఘటనా కాలంలో సన్యట్ సేన్ యొక్క— రష్యాతో మిత్రత్వము, కమ్యూనిస్టులతో సహకారము, కార్మికకర్షకులకు సహాయము— అనే మూడు మూల విధానాలను కొనసాగించింది గనుక కొమింటాంగు విప్లవకరంగాను, పటుతరమైనదిగాను వుంది. ప్రజాతంత్ర విప్లవంలో అనేక వర్గాలమధ్య మిత్రత్వానికి ప్రాతినిధ్యం వహించింది. 1927 పిమ్మట కొమింటాంగు విప్లవ వ్యతిరేకమైన మార్గాన్ని త్రొక్కి బూర్జువా, భూస్వాములయొక్క అభివృద్ధి నిరోధక కూటమిగా తయారైంది. 1936 లో సయాన్ ఘటన పిమ్మట అది మరలా మారి అంతర్యుద్ధ విరమణవైపుకు, జపాన్ సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనేందుకుగాను కమ్యూనిస్టుపార్టీతో మిత్రత్వం వైపుకు కదిలింది. తన మూడు దశలలోను కొమింటాంగు లక్షణాలు యివి. ఈ లక్షణాలు ఏర్పడటానికిగల కారణా లనేకం.

ఇక కమ్యూనిస్టుపార్టీ విషయం: ప్రథమ ఐక్యసంఘటన కాలంలో యిది శైశవదశలో వుంది. 1924-'27 విప్లవాన్ని వీరోచితంగా నడిపింది. కాని విప్లవంయొక్క స్వభావము,

కర్తవ్యాలు, విధానముల అవగాహనకు సంబంధించినంతవరకు తన అపరిపక్వతను వెల్లడి చేసుకుంది. తత్ఫలితంగానే విప్లవం యొక్క చివరిదశలో కన్పట్టిన చెన్‌టూషిజం తన ప్రభావం కలిగించి యీ విప్లవ పరాజయానికి కారణభూతమయింది. 1927 పిమ్మట కమ్యూనిస్టుపార్టీ మరల వ్యవసాయ విప్లవ యుద్ధాన్ని వీరోచితంగా నడిపి, విప్లవసైన్యాన్ని, విప్లవస్థావరాలను సృష్టించుకొంది; అయినా యీ సైన్యానికి, స్థావరాలకు నష్టాలు సంభవించేలా చేసిన దుందుడుకు (Adventurist) తప్పులనుకూడా చేసింది. 1935 నుండి అది యీ తప్పులను దిద్దుకొని జపాను వ్యతిరేక ఐక్యసంఘటనను నడిపింది; ఈ మహోన్నత పోరాటమే యిప్పుడు అభివృద్ధి చెందుతున్నది. ప్రస్తుత దశయందు కమ్యూనిస్టుపార్టీ రెండు విప్లవాల పరీక్షకు నిలబడి విలువైన అనుభవ సముదాయాన్ని సంపాదించిన పార్టీగావుంది. తన మూడుదశలలోను కమ్యూనిస్టుపార్టీయొక్క లక్షణాలు ఇవి. ఈ లక్షణాలు ఏర్పడటానికిగల కారణాలనేకం. ఈ లక్షణాలను అధ్యయనం చేయకుండా, యీరెండు పార్టీలకు వాటి పరిణామంయొక్క వివిధ దశలయందుగల ప్రత్యేక, పరస్పర సంబంధాలు, అనగా ఐక్యసంఘటనా నిర్మాణాన్ని, అది విచ్ఛిన్న మవటాన్ని, తిరిగీ మరో ఐక్యసంఘటన ఏర్పడటాన్ని – అర్థంచేసుకోలేం. రెండుపార్టీల వివిధ లక్షణాలను అధ్యయనం చేయటానికి మనం – ఇది అత్యావసరం గూడాను – రెండుపార్టీల వర్గప్రాతిపదికను, తత్ఫలితంగా రెండుపార్టీలమధ్య వున్న వైరుధ్యాలను, మరియు వివిధ సమయాల్లోని యితర శక్తులను తప్పక అధ్యయనం చేయవలసె వుంటుంది. ఉదాహరణ

ణకు: కమ్యూనిస్టుపార్టీతో మొదటిమైత్రీకాలంలో కొమింటాంగు ఒకవైపున విదేశీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలబడి సామ్రాజ్యవాదాన్ని ఎదిరించింది. రెండవవైపు స్వదేశంలో అసంఖ్యాక ప్రజాబాహుళ్యానికి వ్యతిరేకంగా నిలబడి, కష్టజీవులకు అనేక సదుపాయాలను కలిగిస్తానని వాగ్దానంచేసి గూడా, ఆచరణలో వారికి చాలా తక్కువ సదుపాయాలను కలిగించింది, అసలేమీ కలిగించలేదుగూడా. కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధాన్ని నడిపిన కాలంలో అది ప్రజాబాహుళ్యం విప్లవకాలంలో జయించుకున్న సదుపాయా లన్నిటినీ రద్దుపరచి, ప్రజానీకాన్ని ఎదిరించి నిలచేందుకుగాను సామ్రాజ్యవాదం ఫ్యూడలిజములతో చేతులుకలిపింది; ఆవిధంగా కొమింటాంగు ప్రజానీకంతో తనకున్న వైరుధ్యాన్ని ఇనుమడింపజేసుకుంది. ప్రస్తుత జపాను వ్యతిరేక పోరాటకాలంలో, జపాను సామ్రాజ్యవాదానికి విరుద్ధంగా నిలబడి ఒకవైపు కమ్యూనిస్టుపార్టీతో మైత్రి నెరపాలని ఆశిస్తూనే రెండవవైపు కమ్యూనిస్టుపార్టీకి, చైనాప్రజలకు వ్యతిరేకంగా జరిపే పోరాటాన్నిగాని వారిపై ప్రయోగించే నిరంకుశత్వాన్నిగాని తగ్గించటంలేదు. ఇక కమ్యూనిస్టుపార్టీ ఏ కాలములో అయినప్పటికీ, సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని ఎదిరించేందుకుగాను ప్రజా సామాన్యాన్నే బలపరుస్తూన్నది. ప్రస్తుత జపాను వ్యతిరేక పోరాటకాలంలో, జపానును ప్రతిఘటించేందుకు అనుకూలంలాగా కొమింటాంగు ద్యోతకపర్చుకుంటున్నదిగనుక, కమ్యూనిస్టుపార్టీ కొమింటాంగుయెడల, దేశీయ భూస్వామ్యశక్తులయెడల సున్నితంగా (Mild) వుండే విధానాన్ని అనుసరించింది. ఈ

పరిస్థితులకారణంగా ఒకప్పుడు యీ రెండుపార్టీలమధ్య మైత్రి కొనిరాబడింది. మరొకప్పుడు పోరాటం కొనిరాబడింది. రెండు పార్టీల మధ్య మైత్రీకాలంలోగూడా ఒకే సమయంలో మైత్రి, పోరాటము రెండూ వుండేటువంటి క్లిష్టమైన స్థితిగతుల దశ వుంటూవచ్చింది. నైరుధ్యంయొక్క యీ పలుముఖ లక్షణా లను గనుక మనం అధ్యయనం చేయకపోతే, ఈ రెండు పార్టీ లలో ఒక్కొక్కదానికి ఇతర శక్తులతో వుండే సంబంధాన్ని అవ గాహన చేసుకోటంలో మనం విఫలమవుతాం. అంతేగాక, ఈ రెండుపార్టీల అంతస్సంబంధాన్నిగూడా అవగాహన చేసు కోటంలో విఫలత చెందుతాం.

దీన్నిబట్టి ఏ విధమైన నైరుధ్యంయొక్క నిర్దిష్ట స్వభా వాన్నైనా అధ్యయనం చేయటంలో- అంటే పదార్థంయొక్క వివిధ చలనరూపాలలోని నైరుధ్యము, ప్రతి అభివృద్ధిక్రమంలో వుండే వివిధచలనరూపాలలోని నైరుధ్యము, ప్రతిఅభివృద్ధిక్రమం లోని నైరుధ్యంయొక్క ప్రతి అంశము, ప్రతి అభివృద్ధి క్రమం యొక్క వివిధ దశలయందుండే నైరుధ్యము, మరియు అభివృద్ధి యొక్క వివిధదశలయందుండే నైరుధ్యంయొక్క ప్రతి అంశము- ఈ నైరుధ్యాలన్నిటి నిర్దిష్టస్వభావాన్ని అధ్యయనంచేయటంలో మనం స్వకీయాత్మకమైన నిర్హేతుక నిర్ణయానికి ఎట్టితావు లేకుండా చేసుకొని వాటిని స్పష్టంగా పరిశీలించవలసివుంది. నిర్దిష్టమయిన పరిశీలనద్వారా కాకుండా ఏ నైరుధ్యంయొక్క నిర్దిష్టస్వభావాన్నయినా గమనించటమనేది వుండదు. మనం లెనిన్ మాటలను ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచుకోవాలి : నిర్దిష్ట మయిన పరిస్థితులయొక్క నిర్దిష్ట పరిశీలన.

అట్టి నిర్దిష్ట పరిశీలనకు మంచి నమూనాను మనకు సప్లైచేయటంలో మార్క్సు, ఎంగెల్సులు మొట్టమొదటివారు.

మార్క్సు, ఎంగెల్సులు వస్తువులలోని వైరుధ్య సూత్రాన్ని, సాంఘికచరిత్ర గమనాన్ని అధ్యయనం చేయటానికి వర్తింపజేసినప్పుడు, వారు ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యవున్న వైరుధ్యాన్ని గమనించారు; దోపిడీ వర్గానికి, దోపిడీ చేయబడేవర్గానికి మధ్య వున్న వైరుధ్యాన్ని, తత్ఫలితంగా ఆర్థిక ప్రాతిపదికకు, రాచకీయాలు సిద్ధాంతం మొదలగు కట్టడాలకు మధ్యవున్న వైరుధ్యాన్ని గమనించారు; మరియు వారు యీ వైరుధ్యాలు ఏ విధంగా భిన్నమైన వర్గ సమాజాలలో భిన్నమైన సాంఘిక విప్లవాలకు అనివార్యంగా దారితీస్తాయోకూడ గమనించారు.

మార్క్సు పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక కట్టడాన్ని అధ్యయనం గావించటానికి యీ సూత్రాన్నే వర్తింపచేశాడు. ఆయన ఆ సందర్భంలో ఉత్పత్తియొక్క సాంఘిక స్వభావానికి, యాజమాన్యంయొక్క ప్రైవేటు స్వభావానికి మధ్యవున్న వైరుధ్యమే యీ సమాజంయొక్క మూలమైన వైరుధ్యమని గమనించాడు. ఈ వైరుధ్యమే వ్యక్తిగత సంస్థలలోని వుత్పత్తి యొక్క నిర్మాణాత్మక స్వభావానికి, మొత్తంగా సమాజంలో జరిగే ఉత్పత్తియొక్క నిర్మాణరహిత స్వభావానికి మధ్యవున్న వైరుధ్యంలో ద్యోతక మవుతుంది. ఈ వైరుధ్యమే వర్గదృష్ట్యా బూర్జువావర్గానికి, కార్మికవర్గానికి మధ్య వైరుధ్యంగా ద్యోతక మవుతుంది.

వస్తువులయొక్క విస్తృత స్వభావంవల్లను, వాటి అభివృద్ధికివున్న అనంతావకాశాల వల్లను ఒక సందర్భంలో విశ్వవ్యాపకత్వమే మరో సందర్భంలో ప్రత్యేకత్వం క్రిందకు మారుతుంది. మరోవైపు, ఒక సందర్భంలో ప్రత్యేకత్వంగా వుంది. మరో సందర్భంలో విశ్వవ్యాపకత్వం క్రిందకు మారుతుంది. పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తిని సంఘపరం చేయటానికి, వుత్పత్తిసాధనాలపై వుండే ప్రైవేటు యాజమాన్యానికి మధ్య ఇమిడివుండే వైరుధ్యమే పెట్టుబడిదారీవిధానం పుట్టి పెరిగే అన్ని దేశాలలోను వుంటుంది. పెట్టుబడిదారీ విధానానికి సంబంధించినంతవరకు ఇదే వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వ మవుతుంది అయినప్పటికీ పెట్టుబడిదారీ విధానంలోని ఈ వైరుధ్యం సాధారణంగా వర్గసమాజంయొక్క అభివృద్ధిలో ఒక చారిత్రాత్మక దశకు సంబంధించిందిగా వుంటుంది. సాధారణంగా వర్గసమాజంలో వుత్పత్తిశక్తులకు, వుత్పత్తి సంబంధాలకు మధ్యవుండే వైరుధ్యానికి సంబంధించినంతవరకు ఇదే వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వంగా వుంటుంది. అయితే పెట్టుబడిదారీ సమాజంలో ప్రతివైరుధ్యముయొక్క ప్రత్యేకత్వాన్ని మార్క్సు పరిశీలన ద్వారా బహిర్గతంచేశాడు. అదే సమయంలో ఆయనసాధారణంగా వర్గసమాజంలో వుత్పత్తి శక్తులకు, వుత్పత్తి సంబంధాలకు మధ్యవుండే వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని (Universality) యింకా గొప్పగా, యింకా సక్రమంగా, యింకా సంపూర్ణంగా నిర్ధరించాడు.

ప్రత్యేకమనేది విశ్వవ్యాపకమనేదానితో సంబంధించియుంటుంది. ప్రతి వస్తువులోను వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వమే

గాకుండా వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వంగూడా నైజంగానే వుంటుంది. అనగా విశ్వవ్యాపకత్వమనేది ప్రత్యేకత్వంలో వుంటుంది. గనుక ఒకవిషయాన్ని మనం అధ్యయనం చేయుటంలో యీ రెండు అంశాలను వాటి అంతస్సంబంధాలను కనుక్కోవాలి; ఆ విషయంలోనే ప్రత్యేకత్వము, విశ్వవ్యాపకత్వాల (Universality) యొక్క రెండు అంశాలను, వాటి అంతస్సంబంధాలను కనుక్కోవాలి; మరియు యీ విషయానికీ, దీనికి బయటవున్న అనేక విషయాలకూ మధ్యవున్న అంతస్సంబధాన్ని కనుక్కోవాలి. స్టాలిన్ "లెనినిజంయొక్క పునాదులు" అనే తన ప్రఖ్యాతగ్రంథంలో లెనిజంయొక్క చారిత్రక మూలకాలను వివరించినప్పుడు ఆయన ఏ అంతర్జాతీయ పరిస్థితిలో లెనినిజం ఉద్భవించిందో ఆ అంతర్జాతీయ పరిస్థితిని పరిశీలనజరిపాడు; సామ్రాజ్య పరిస్థితులలో చరమస్థాయికి వచ్చిన పెట్టుబడిదారీ విధానంలోని వివిధ వైరుధ్యాలను అనుశీలన జరిపి, ఏవిధంగా యీ వైరుధ్యాలు కార్మిక వర్గ విప్లవాన్ని తక్షణ ఆచరణీయసమస్యగా తెచ్చాయో పరిశీలన జరిపాడు; ఈ వైరుధ్యాలు పెట్టుబడిదారీ విధానంపై సరాసరి దాడిజరిపేందు కనువైన పరిస్థితులను ఎలా కల్పించాయో అనుశీలన జరిపాడు. ఇవన్నీగాక, ఆయన లెనినిజానికి రష్యా స్థావరమవటానికి గల కారణాలను, జారిస్టు రష్యా సామ్రాజ్యవాదంయొక్క అన్ని వైరుధ్యాలకు నిలయమయిన విధానాన్ని, రష్యన్ కార్మికవర్గం అంతర్జాతీయ విప్లవ కార్మిక వర్గానికి పురోగామిగా ఎందుకు తయారుకాగలిగిందీ అనుశీలన జరిపాడు. ఈవిధంగా స్టాలిన్ సామ్రాజ్యవాద, కార్మికవర్గ

విప్లవశకాల మార్క్సిజమే లెనినిజమని చూపిస్తూ సామ్రాజ్య వాదంలోని వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని అనుశీలన జరిపాడు. మరియు కార్మికవర్గ విప్లవం యొక్క సిద్ధాంతానికి, ఎత్తుగడలకు ఏవిధంగా రష్యా పుట్టినిల్లయిందో చూపుతూ, అలాంటి ప్రత్యేకత్వంలో విశ్వవ్యాపకత్వం ఎలా ఇమిడివుందో చూపిస్తూ సాధారణ వైరుధ్యంలో జారిస్టు రష్యాయొక్క సామ్రాజ్యవాద ప్రత్యేకత్వాన్ని అనుశీలన జరిపాడు. స్టాలిన్ చేసిన యీ విధమయిన అనుశీలన వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వ, విశ్వవ్యాపకత్వాలను, వాటి అంతస్సంబంధాన్ని అర్థంచేసు కోటానికి ఒక నమూనాగా మన కుపకరిస్తుంది.

భౌతికమైన (Objective) విషయాలను అధ్యయనం చేయటానికి గతితార్కిక సూత్రాలను వర్తింపచేసే సమస్యపై మార్క్సు, ఎంగెల్సులు, అదే విధంగా లెనిన్, స్టాలిన్లు నిరంతరం ప్రజలను ఊహతో సమాధానపడే భ్రమకు లోనుగావద్దనీ, భౌతిక యథార్థాలలో యిమిడియున్న నిర్దిష్ట పరిస్థితులనుండి నిర్దిష్ట వైరుధ్యాలను, వైరుధ్యాల ప్రతిహాంశముయొక్క నిర్దిష్ట పాత్రను, మరియు వైరుధ్యాల మధ్యవుండే నిర్దిష్ట సంబంధాలను కనుగొనవలయునని ఉపదేశించారు. మన ఛాందసులు తమ అధ్యయనంలో అటువంటి వైఖరిని అవలంబించటంలేదు. గనుక వారు ఎప్పుడూ సక్రమమార్గంలో నడువలేరు. మనం ఛాందసవాద విఫలతనుండి హెచ్చరికను తీసుకొని, అధ్యయనంలో అలాంటి వైఖరిని అలవర్చుకోవలసియుంది. అంతకన్న వేరుమార్గం లేదు.

వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వము, ప్రత్యేకత్వముల మధ్య సంబంధమే వైరుధ్యాలయొక్క సాధారణ స్వభావము, వ్యక్తిగత స్వభావములమధ్య సంబంధంగా వుంది. సాధారణ స్వభావమంటే మన అభిప్రాయం యిది: వైరుధ్యమనేది అన్ని గతులలోను వుంటుందని, మొదటినుండి చివరివరకు అన్నిగతుల గుండా వ్యవహరిస్తుందని; చలనము, వస్తువులు, గతులు, ఆలోచనలు - యివన్నీ వైరుధ్యములే. వస్తువులలో వైరుధ్యాలు లేవనటమంటే ఏదీ లేదనటమే. ఇది ప్రాచీనకాలంలో గాని, ఆధునిక కాలంలోగాని, చైనాలోగాని, విదేశాలలోగాని ఎట్టి మినహాయింపుకు అవకాశంలేని సర్వవ్యాప్తమైన సూత్రం. అందువల్లనే యీ సూత్రానికి సాధారణ స్వభావము, సమగ్రత్వమూ వున్నాయి. అయితే యీ సాధారణ స్వభావం అన్ని వ్యక్తిగత స్వభావాలలోను యిమిడియుంది; వ్యక్తిగత స్వభావమంటూ లేకుండా సాధారణ స్వభావమనేది వుండదు. అన్ని వ్యక్తిగత స్వభావాలను తొలగిస్తే యిక ఏ సాధారణ స్వభావం మిగులుతుంది? ప్రతివైరుధ్యమూ ప్రత్యేకమైంది గనుక దాని వ్యక్తిగత స్వభావాలు ఏర్పడుతున్నాయి. అన్ని వ్యక్తిగత స్వభావాలు నిబద్ధంగాను (Conditionally), తాత్కాలికంగాను వుంటాయి. అందువల్లనే అవి పరస్పర సంబంధం కలిగివుంటాయి.

సాధారణ స్వభావము, వ్యక్తిగత స్వభావము, సమగ్రత్వము- సాపేక్షము అనే యీసూత్రమే వస్తువులలోని వైరుధ్య సూత్రంయొక్క సారాంశం; దీన్ని అర్థంచేసుకోకపోవటమంటే గతి తార్కిక సూత్రాలను విడనాడటంతో సమానమే.

## 4. ప్రధానమైన వైరుధ్యము - వైరుధ్యంయొక్క ప్రధానమైన అంశము

(The Principal Contradiction and the Principal aspect of a contradiction)

వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వ సమస్యనుగురించి యింకా రెండు అంశాలున్నాయి. అనుశీలన జరపటానికి వీటిని ప్రత్యేకంగా బయటకు లాగాల్సియుంటుంది. అవే ప్రధానవైరుధ్యము, వైరుధ్యంయొక్క ప్రధానమైన అంశము.

క్లిష్టమైన (Complex) విషయంయొక్క అభివృద్ధి క్రమంలో అనేక వైరుధ్యాలుంటాయి; వీటిల్లో ఒకటి తప్పనిసరిగా ప్రధాన వైరుధ్యంగా వుంటుంది. ఈ ప్రధాన వైరుధ్యం యొక్క వునికి, అభివృద్ధి మిగతా వైరుధ్యాలను నిర్ణయిస్తాయి, లేక మిగతా వైరుధ్యాలపై తమ ప్రభావం కలిగిస్తాయి.

ఉదాహరణకు, పెట్టుబడిదారీ సమాజంలో వైరుధ్యంలో వున్న రెండు వ్యతిరేకశక్తులైన కార్మికవర్గము బూర్జువావర్గము ప్రధాన వైరుధ్యంగా ఏర్పడతాయి; మిగతా వైరుధ్యాలు - ఉదాహరణకు, ఫ్యూడల్ వర్గ అవశేషాలకు - బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యము, గ్రామీణ పెటీబూర్జువాకు - బూర్జువాకు మధ్య వైరుధ్యము, కార్మికవర్గానికి - గ్రామీణ పెటీబూర్జువాకు మధ్య వైరుధ్యము, లిబరల్ బూర్జువాకు - గుత్తాధికార బూర్జువాకు మధ్య వైరుధ్యము, బూర్జువా ప్రజాతంత్రానికి - బూర్జువా ఫాసిజానికి మధ్య వైరుధ్యము, పెట్టుబడిదారీదేశాల మధ్యనే వైరుధ్యము, సామ్రాజ్యవాదానికి - వలసదేశాలకు

మధ్య వైరుధ్యము. వగైరా- వైరుధ్యాలన్నీ పై ప్రధాన వైరుధ్యంచే నిర్ణయించబడతాయి; దాని ప్రభావంలో వుంటాయి.

చైనాలాంటి అర్ధవలస దేశాల్లో ప్రధాన వైరుధ్యానికి, అప్రధాన వైరుధ్యాలకు మధ్యవుండే సంబంధం చిక్కు- పరిస్థితిని తెచ్చిపెడుతుంది.

అటువంటి దేశంపై సామ్రాజ్యవాదం దాడిజరిపినప్పుడు దేశద్రోహులు మినహాయించి ఆ దేశంలో వుండే వివిధవర్గాలు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ పోరాటం సాగించడానికి తాత్కాలికంగా ఐక్యంకా గలుగుతాయి. అటువంటి సందర్భంలో సామ్రాజ్యవాదానికి ఆ దేశానికి మధ్య వైరుధ్యం ప్రధానవైరుధ్యమవుతుంది. దేశంలోని వివిధవర్గాలమధ్య వుండే వివిధ వైరుధ్యాలు (ఫ్యూడల్ విధానానికి అశేష ప్రజాసామాన్యానికి మధ్యవుండే ప్రధానవైరుధ్యంతో సహా) తాత్కాలికంగా దిగువ స్థానంలోకి వెళ్ళిపోతాయి. చైనాలో 1840 నల్లమందు యుద్ధం, 1894 చైనా - జపాన్ యుద్ధం, 1900 లో బాక్సర్ యుద్ధములలోని సందర్భాలు యివే; ప్రస్తుత చైనా జపాను యుద్ధంలోగూడా యిదే సందర్భం. మరోరకమైన పరిస్థితిలో వైరుధ్యాల స్థితిగతుల సంబంధాలు మార్పు చెందుతాయి. సామ్రాజ్యవాదం యుద్ధవత్తిడితేకుండా తన దోపిడీని కొనసాగించడానికి రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక వగైరా కొంత తేలికరూపాలను అనుసరించినప్పుడు అర్ధవలస దేశాలలోని పాలకవర్గాలు సామ్రాజ్యవాదానికి లొంగిపోతాయి; యీ రెండువర్గాలు ప్రజాబాహుళ్యాన్ని జాయింటుగా దోచుకొనేందుకు స్నేహం కుదుర్చుకుంటాయి. అట్టి సందర్భంలో,

సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వర్గాల స్నేహాన్ని ఎదుర్కోటానికి ప్రజాబాహుళ్యం తరచుగా అంతర్యుద్ధరూపాన్ని అనుసరిస్తుంది. సామ్రాజ్యవాదమేమో ప్రజల నణచేందుకు ప్రత్యక్ష చర్యకు పూనుకోకుండా అర్థవలస దేశాలలోని అభివృద్ధి నిరోధకులకు పరోక్షంగా సాయపడుతుంది. ఇది అంతర్గత వైరుధ్యాలయొక్క ప్రత్యేక సునిశితత్వాన్ని (Special sharpness) తెలియజేస్తుంది. ఈ సందర్భమే చైనాలో 1911 విప్లవపోరాటంలోను 1924—'27 విప్లవపోరాటంలోను, 1927 లగాయతు నడచిన దశవర్ష వ్యవసాయ విప్లవపోరాటంలోను వ్యక్తమవుతుంది. అంతేగాక, అర్థవలస దేశాలలో వివిధ అభివృద్ధినిరోధక పాలక వర్గాలమధ్య జరిగిన అంతర్యుద్ధాలు, అనగా చైనాలో యుద్ధ ప్రభువుల మధ్య యుద్ధాలుకూడా యీ తరహాకు చెందినవే.

ఒక విప్లవకర అంతర్యుద్ధం సామ్రాజ్యవాదముయొక్క దాని తొత్తులయిన దేశీయ అభివృద్ధినిరోధకులయొక్క వునికిని ప్రధానంగా దెబ్బకొట్టే స్థితికి వచ్చినప్పుడు, తన పరిపాలన నిలబెట్టుకొనే ప్రయత్నంలో సామ్రాజ్యవాదం తరచుగా పైన చెప్పిన పద్ధతులనుగాక యితర పద్ధతులను అవలంబిస్తుంది. అది లోపలనుండి విప్లవసంఘటనను విచ్ఛిన్నంచేయటానికైనా ప్రయత్నిస్తుంది లేదా దేశీయ అభివృద్ధినిరోధకులకు ప్రత్యక్ష సహాయంగా సాయుధబలాలనైనా పంపుతుంది. అట్టి సందర్భాల్లో, విదేశీ సామ్రాజ్యవాదము, దేశీయ అభివృద్ధినిరోధకులు సంపూర్ణంగాను, బహిరంగంగాను ఒకవైపు నిలబడుతారు. అశేష ప్రజాబాహుళ్యం రెండోవైపు నిలబడుతుంది; ఈ రెండు పక్షాలు యితర వైరుధ్యాలను నిర్ణయించే విధంగా, వాటిపై

తమ ప్రభావం కలిగించే విధంగా ప్రధాన వైరుధ్యంగా ఏర్పడుతాయి. అక్టోబరు విప్లవం పిమ్మట రష్యన్ అభివృద్ధినిరోధకులకు అనేక పెట్టుబడిదారీ దేశాలు యిచ్చిన సహాయం సాయుధ జోక్యానికి ఒక నిదర్శనం; 1927 లో చాంగ్-కై-షేక్ చేసిన ద్రోహం విప్లవ సంఘటనను క్షీణింపజేయుటానికి ఒక నిదర్శనం.

ఏది జరిగినప్పటికీ, అభివృద్ధిక్రమంలో ప్రతి దశయందు నాయకపాత్రను నిర్వహించే ప్రధాన వైరుధ్యం ఒకే ఒకటి వుంటుందనేది నిస్సంశయం.

దీన్నిబట్టి, ఏ గతిక్రమంలోనైనా అనేక వైరుధ్యాలున్నట్లయితే వాటిల్లో ఒకటిమాత్రమే ప్రధానవైరుధ్యమవుతుందనీ, అదే నాయకత్వ నిర్ణాయకపాత్ర నిర్వహిస్తుందనీ, మిగతావి ద్వితీయస్థానంలో వుంటాయనీ చూడగలుగుతాం. ఆ విధంగా, ఏ గతిక్రమమైనా- రెండుకన్న పైగా వైరుధ్యాలున్న క్లిష్టమయిన గతిక్రమ మయినట్లయితే- అధ్యయనం చేయటంలో దాని ప్రధాన వైరుధ్యాన్ని కనుక్కోటానికి మన శక్తినంతా వినియోగించాలి. ఈ ప్రధాన వైరుధ్యంగనక ఒకపర్యాయం చిక్కితే ఏ సమస్యయైనా సత్వరం పరిష్కరించబడగలదు. మార్క్సు పెట్టుబడిదారీసమాజాన్ని అధ్యయనం గావించటంలో ఆయన మనకు నేర్పిన విధానం యిదే. లెనిన్, స్టాలిన్లు సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభాన్ని అధ్యయనం చేసినప్పుడూ, సోవియట్ ఆర్థిక విధానాన్ని అధ్యయనం చేసినప్పుడూ మనకు యీ విధానాన్నే బోధించారు. వేలాది పండితులు, కార్యకర్తలు యీ విధానాన్ని అర్థంచేసుకోరు. తత్ఫలితంగా అయో

మయంలో పష్టంతిగా గాభరాచెంది ఒక సమస్యయొక్క మూలాన్ని కనుక్కోలేకపోతారు. అలాగే వైరుధ్యాలను పరిష్కరించే విధానాన్ని కూడా కనుక్కోలేక పోతారు.

పైన చెప్పినప్రకారం, ఒకగతిక్రమంలోని వైరుధ్యాలన్నీ సమమైనవిగా మనం చూడకూడదు. ప్రధాన వైరుధ్యాన్ని, అప్రధాన వైరుధ్యాలను విచక్షణచేసి ప్రధానవైరుధ్యాన్ని చిక్కించుకోటానికి ప్రత్యేకమైన శ్రద్ధ వహించాలి. కాని ఏ వైరుధ్యంలోనైనాసరే, అది ప్రధానమైందిగానీ, అప్రధానమైందిగానీ, దాని రెండు విరుద్ధ అంశాలను సమమైనవిగా భావించవచ్చునా ?

లేదు. మన మలా భావించకూడదు; ఏ వైరుధ్యంలోనైనా, ఎప్పుడైనాసరే విరుద్ధ అంశాల అభివ్యక్తి అసమానంగా వుంటుంది. కొన్ని సందర్భాల్లో విరుద్ధశక్తులు సమానమైన తూకంగా యున్నట్లు కనబడతాయి. కాని అది తాత్కాలికము, సాపేక్షములో కూడుకున్న స్థితి మాత్రమే. మూలమైన స్థితి అసమానతే; రెండు విరుద్ధ అంశాలలో ఒకటి ప్రధానము, రెండవది అప్రధానము అయితీరవలసిందే. ప్రధానమైన అంశము వైరుధ్యంలో నాయకత్వపాత్రను నిర్వహించే స్థితినే సూచిస్తుంది. ఆధిపత్యస్థానాన్ని ఆక్రమించిన వైరుధ్యంయొక్క ప్రధాన అంశంచేతనే ఒక విషయంయొక్క గుణం ప్రధానంగా నిర్ణయించబడుతుంది.

అయితే యీ స్థితి అలాగే వుండిపోయేదికాదు. ఒక వైరుధ్యంయొక్క ప్రధాన అంశము, అప్రధాన అంశము - యీ రెండూ ఒకదాని స్థానంలోకి ఒకటి మార్పుచెందుతాయి.

తదనుగుణ్యంగా వస్తువుయొక్క గుణం మారుతుంది. ఒకానొక గతిక్రమంలో లేక నైరుధ్యంయొక్క అభివృద్ధిలో ఒకానొక దశయందు ప్రధాన అంశం 'ఎ' గాను, అప్రధాన అంశం 'బి' గాను వుంటుంది; అభివృద్ధియొక్క మరొక దశయందు లేక అభివృద్ధియొక్క మరొక గతిక్రమంలో ఆ స్థానాలు తారుమారవుతాయి. – ఈ మార్పు ఒక వస్తువులో నైరుధ్యంయొక్క రెండు అంశాల పోరాట తీవ్రత హెచ్చుతగ్గులచేత నిర్ణయించబడుతుంది.

మనం తరచుగా 'పాతదానిస్థానే క్రొత్తది రావటము'ను గురించి చెప్పుకుంటుంటాం. పాతదాని స్థానాన్ని క్రొత్తది ఆక్రమించుకోవటమనేది విశ్వవ్యాపితసూత్రం. ప్రపంచంయొక్క సదా తిరుగులేని శాసనమిది. ఒక విషయం తన స్వభావము, తానున్న పరిస్థితులనుబట్టి మరొక విషయంలోకి పరివర్తన చెందుతుంది. రకరకాల స్థాయీరూపాలద్వారా యీ మారట ముంటుంది; పాతదాని స్థానాన్ని క్రొత్తది ఆవహించడానికి గతిక్రమం అదే. ప్రతి విషయములోను దాని క్రొత్త అంశానికి – పాత అంశానికి మధ్య నైరుధ్యం యిమిడియుంటుంది. అదే అనేక చిక్కైన పోరాటాలుగా ఏర్పడుతుంది. ఈ పోరాటాల ఫలితంగా క్రొత్త అంశం పెరిగి ఆధిపత్యస్థానంలోకి వచ్చే విషయంగా వుంటుంది. పాత అంశమేమో క్షీణించి క్రమేణా నాశనం పొందే విషయంగా మారిపోతుంది. పాత అంశంమీద ఆధిపత్యం వహించే స్థానాన్ని క్రొత్త అంశం సాధించిన సమయానే పాత విషయంయొక్క గుణం క్రొత్తవిషయంయొక్క గుణంలోకి మారిపోతుంది. దీన్నిబట్టి ఒక విషయంయొక్క

గుణం ప్రధానంగా ఆధిపత్యంలోకి వచ్చిన వైరుధ్యంయొక్క ప్రధాన అంశంచేత ముఖ్యంగా నిర్ణయించబడుతుందని కనబడు తుంది. ఆధిపత్యం సంపాదించిన వైరుధ్యంయొక్క ప్రధాన అంశంలో మార్పు వచ్చినప్పుడు తదనుగుణంగా విషయం యొక్క గుణమూ మారుతుంది.

ఫ్యూడల్ సమాజపు ఆఖరు దశలో అధీనస్థానంలో శక్తిగావుండిన పెట్టుబడిదారీ విధానం పెట్టుబడిదారీసమాజంలో ఆధిపత్యస్థానంలోకి మార్పుచెందింది. సమాజంయొక్క స్వభావం గూడా ఫ్యూడల్‌తరహానుండి పెట్టుబడిదారీ తరహాలోకి మారిపోయింది. పెట్టుబడిదారీ సమాజపు నూతనశకంలో, ఫ్యూడల్ శక్తులు మొదట్లో ఆధిపత్యస్థానంలోవుండిన స్థితినుండి అధీనస్థాయిలోని శక్తులుగా మారిపోయి క్రమేణా వినాశన స్థితికి చేరుకున్నాయి. ఉదాహరణకు ఫ్రాన్సు బ్రిటనులలో ఇదే సందర్భం. ఉత్పత్తి శక్తుల అభివృద్ధితో, బూర్జువావర్గం అభి వృద్ధికరపాత్రను నిర్వహించే నూతనవర్గస్థానంనుండి అభివృద్ధి నిరోధకపాత్ర నిర్వహించే పాతవర్గంక్రిందికి మారిపోయింది. పర్యవసానంగా కార్మికవర్గంచేతుల్లో పతనాన్ని పొందేవరకూ పోయి తన ప్రైవేటు ఉత్పత్తి సాధనాలను, అధికారాన్ని పోగొట్టుకొని, తర్వాత క్రమేణా వినాశనస్థితికికూడా చేరు కుంటుంది. బూర్జువావర్గంకన్నా అత్యధిక సంఖ్యగా వుండి, బూర్జువావర్గ పాలనక్రిందనే వుండి బూర్జువావర్గంతోబాటే పెరిగే కార్మికవర్గం ఒక నూతనశక్తి; కార్మికవర్గం బూర్జువా వర్గానికి అధీనంగావున్న తన ప్రారంభస్థితినుండి క్రమేణా బలవత్తరమై స్వతంత్రమైన వర్గంగా, చరిత్రలో నాయకత్వ

పాత్రను నిర్వహిస్తూ, చివరకు రాజకీయాధికారాన్నే హస్తగతం చేసుకొని పాలకవర్గంగా ఏర్పడుతుంది.

అట్టి సందర్భంలో సమాజ స్వభావం పాతపెట్టుబడిదారీ సమాజ స్వభావంనుండి నూతన సోషలిస్టు సమాజ స్వభావం లోకి మార్పు చెందుతుంది. సోవియట్ యూనియన్ యిప్పటికి నడచిన, అన్ని యితర దేశాలూ అనివార్యంగా యిక నడవ బోయే మార్గం యిదే.

ఇక చైనాలో పరిస్థితినిగురించి: సామ్రాజ్య వాదం చైనాను అర్ధవలస దేశంగా చేసి, దాని ప్రజలను అణచే సైరు ధ్యంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించియుండగా చైనాస్వతంత్ర దేశంనుండి అర్ధవలసగా మారిపోయింది. కాని యీా పరిస్థితి అనివార్యంగా మారుతుంది; రెండు పక్షాలమధ్య పోరాటంలో కార్మికవర్గ నాయకత్వంక్రింద పెంపుచెందే చైనా ప్రజల బల సంపద అనివార్యంగా చైనాను అర్ధవలసనుండి స్వతంత్రదేశంగా మార్చుతుంది. ఇక సామ్రాజ్యవాదమేమో పతనం గావించ బడుతుంది. పాతచైనా అనివార్యంగా నవచైనాగా మార్పు చెందుతుంది.

పాతచైనా నవచైనాగా చెందే మార్పులోనే చైనా ఫ్యూడలిస్టు పాతశక్తులకు-చైనా ప్రజల నూతనశక్తులకు మధ్య వుండే పరిస్థితి మార్పుగూడా యిమిడివుంది. పాత ఫ్యూడల్ భూస్వామ్యవర్గం పతనం గావించబడుతుంది, అది పాలకస్థానం నుండి పాలితస్థానంలోకి వెళ్ళుతుంది. ప్రజలు కార్మికవర్గ నాయకత్వంక్రింద పాలిత స్థానంనుండి పాలకులుగా ఏర్పడి పోతారు. అదే సమయంలో, చైనా సమాజ స్వభావం

మార్పు చెందుతుంది. అనగా, పాత అర్ధవలస, అర్ధ ఫ్యూడల్ సమాజం నూతన ప్రజాతంత్రసమాజం క్రిందకు మారిపోతుంది.

అట్టి పరస్పరం మార్పులుచెందే నిదర్శనాలు మన గతానుభవంలో కనుపిస్తాయి. సన్ యట్ సేన్ నాయకత్వాన రివల్యూషనరీ లీగ్ (విప్లవసంస్థ) నాయకత్వాన కొద్దికాలంపాటు విజయం సాధించిన సందర్భంలో చైనాను దాదాపు 300 సంవత్సరాలు పాలించిన మంచూ రాజవంశం 1911 విప్లవంలో పతనం గావించబడింది. ఒకప్పుడు సర్వాధికారులుగా యున్న ఉత్తరప్రాంతపు యుద్ధ ప్రభువులు పతనం గావించబడిన సందర్భంగా, 1924-'27 విప్లవ పోరాటంలో దక్షిణాదిన విప్లవ శక్తులూ, కమ్యూనిస్టుపార్టీ-కొమింటాంగుల మధ్య మైత్రీ బల హీనతనుండి బలోపేతంగా పెంపొంది ఉత్తరయాత్రలో విజయాన్ని సాధించాయి. 1927 లో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద ప్రజాశక్తులు, కొమింటాంగు అభివృద్ధి నిరోధకశక్తుల దాడి దెబ్బలుతింటూ బలహీనపడ్డాయి. కాని తన శ్రేణుల్లో అవకాశవాదాన్ని నిర్మూలించుకొనుటతో మరల క్రమేణా బలీయమైనాయి. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన విప్లవ స్థావరాల్లో రైతులు పాలితస్థానంలోనుండి పాలకులుగా మార్పు చెందారు. అదేసందర్భంలో భూస్వాములు తద్వ్యతిరేక మార్పుకు లోనైనారు. ఎల్లప్పుడూ యిదే విధంగా ప్రపంచంలో పాతదాని స్థానాన్ని క్రొత్తది ఆక్రమించుకోటము, క్రొత్తదానిచేత పాతది నెట్టివేయబడటము, పాతది నిర్మూలించబడి క్రొత్తది ప్రవేశపెట్టబడడము జరుగుతుంది.

విప్లవ పోరాటంలో కొన్ని సందర్భాల్లో కష్టాలు సదవకాశాలను మించివుంటాయి; అట్టి సందర్భాల్లో కష్టాలే వైరుధ్యంయొక్క ప్రధాన అంశంగా, సదవకాశాలే అప్రధాన అంశంగానుయేర్పడతాయి. కాని విప్లవకారుల కృషి ఫలితంగా క్రమేణా కష్టాలు అధికమించబడగలవు. సదవకాశంతో గూడిన నూతన పరిస్థితి ఏర్పడుతుంది. కష్టపరిస్థితి అనుకూల పరిస్థితికి తావిస్తుంది. చైనాలో 1927 లో విప్లవం ఓడిపోయిన తర్వాతను, చైనా ఎర్రసైన్యంయొక్క దీర్ఘయాత్రలోను యిటువంటిదేసందర్భం. ప్రస్తుతచైనా-జపాను యుద్ధంలో చైనామరలా కష్టస్థితిలోకి వచ్చింది; కాని యీ దుస్థితిని మార్చి చైనా జపాను స్థితుల్లో ప్రధానమైన మార్పుకొనిరాగలం. అదేవిధంగా విప్లవకారులు తప్పులుచేస్తే అనుకూలపరిస్థితులు కష్టపరిస్థితుల్లోకి మార్చబడగలవుకూడాను. 1924—'27 విప్లవవిజయం ఓటమి క్రిందకు మారిపోయింది. 1927 పిమ్మట దక్షిణ రాష్ట్రాల్లో పెంపుగాంచిన విప్లవస్థావరాలన్నీ 1934లో ఓటమినిపొందాయి.

అజ్ఞానం పోగొట్టుకొని జ్ఞానం సంపాదించేందుకు మనం గావించే అధ్యయనంలో ఏర్పడే వైరుధ్యంగూడా యిలాంటిదే. మనం మొట్టమొదటగా మార్క్సిజాన్ని అధ్యయనం చేసేటప్పుడు మార్క్సిజాన్ని గురించిన అజ్ఞానంగాని, లేక చాలీ చాలని జ్ఞానంగాని మార్క్సిస్టు విజ్ఞానానికి విరుద్ధంగావుంటుంది. కాని పట్టుదలతోగూడిన అధ్యయనం ఫలితంగా అజ్ఞానం జ్ఞానంలోకి, కొరవైన జ్ఞానం తగినంత జ్ఞానంలోకి మార్క్సిజాన్ని వినియోగించటంలో వుండే గ్రుడ్డితనం నిపుణతతోగూడిన ఆచరణలోకి మార్పు జెందుతుంది.

కొంతమంది దీనికి భిన్నమైన వైరుధ్యాలున్నాయని అనుకుంటారు- ఉదాహరణకు: ఉత్పత్తిశక్తులకు - ఉత్పత్తిసంబంధాలకు మధ్యవున్న వైరుధ్యంలో ఉత్పత్తిశక్తులే ప్రధాన అంశం ; సిద్ధాంతము, ఆచరణలమధ్య వైరుధ్యంలో ఆచరణే ప్రధాన అంశం ; ఆర్థికపునాది - దాని ఊర్ధ్వకట్టడములమధ్య వైరుధ్యంలో ఆర్థిక పునాదే ప్రధాన అంశం, వీటి వీటిస్థానాల్లో ఎట్టి మార్పు వుండదు: ఇట్టి వైఖరి యాంత్రిక భౌతికవాదానిదేకాని, గతితార్కిక భౌతికవాదానిదికాదు. నిజమే, ఉత్పత్తి శక్తులు, ఆచరణ, ఆర్థికపునాది- ఇవి సాధారణంగా ప్రధానము నిర్ణాయకము అయిన పాత్ర స్థానంలో ద్యోతకమవుతాయి; దీన్ని అంగీకరించని ఎవ్వరైనా భౌతికవాదికానేరడు. కాని కొన్ని పరిస్థితుల్లో ఉత్పత్తి సంబంధాలు, సిద్ధాంతము, ఊర్ధ్వ కట్టడములాంటి అంశాలు తమవంతు వచ్చినప్పుడు ప్రధానము, నిర్ణాయకము అయిన పాత్ర స్థానంలో ద్యోతకమవుతాయి. ఇదిగూడా అంగీకరించవలసిందే. ఉత్పత్తి సంబంధాలు మార్పు జెందేవరకు ఉత్పత్తిశక్తులు అభివృద్ధికా వీలులేని సందర్భంలో ఉత్పత్తి సంబంధాలలో మార్పు ప్రధానము, నిర్ణాయకము అయిన పాత్రను నిర్వహిస్తుంది. లెనిన్ చెప్పినట్లు "విప్లవ సిద్ధాంతము లేకుండా విప్లవోద్యమమంటూ వుండజాల"నప్పుడు విప్లవ సిద్ధాంతాన్ని సృష్టించి బలపర్చటం ప్రధానము నిర్ణాయకము నయిన పాత్రను నిర్వహిస్తుంది. ఒకపని (ఏపనైనా సరే) చేయవలసివచ్చి ఒక ఆదేశము, పద్ధతి, విధానము, పాలసీ యింకనూ లేనప్పుడు ఆదేశము, విధానము, పద్ధతి, పాలసీ ను నిర్ణయించటమే ప్రధానము నిర్ణాయకమునయిన పాత్రను నిర్వహిస్తుంది.

రాజకీయ ..., సంస్కృతి వగైరా ఊర్ధ్వకట్టడము ఆర్థిక ప్రనాది యొక్క పురోగమనాన్నే ఆటంకపరచినప్పుడు రాజకీయ, సాంస్కృతిక సంస్కరణలే ప్రధాన నిర్ణాయకవిషయాలవు తాయి. ఇలా అనటంలో మనం భౌతికవాదానికి విరుద్ధంగా పోతున్నామా ? లేదు. ఇదీ కారణం : మొత్తంగా చరిత్రపురోగమనంలో ఆధ్యాత్మికవిషయాలను నిర్ణయించేది భౌతికవిషయాలని, సాంఘిక చైతన్యాన్ని నిర్ణయించేది సాంఘిక జీవనమనీ మనం గుర్తిస్తాం. అయితే అదేసమయంలో సాంఘికజీవనం మీద ఆధ్యాత్మిక విషయాల ప్రభావము, సాంఘిక చైతన్యం యొక్క ప్రభావములను, ఆర్థిక ప్రాతిపదికమీద ఊర్ధ్వకట్టడం యొక్క ప్రభావమును గుర్తిస్తాం, గుర్తించాలి కూడా. ఇది భౌతికవాదానికి విరుద్ధంగా పోవటంకాదు; ఇది సరిగ్గా యాంత్రిక భౌతికవాదాన్ని విడనాడి గతితార్కిక భౌతికవాదాన్ని గట్టిగా సమర్థించటమే యవుతుంది.

వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వ సమస్యను అధ్యయనం చేయటంలో యీ రెండు పద్ధతులను — (1) గతిక్రమంలో ప్రధానవైరుధ్యము, అప్రధానవైరుధ్యము, మరియు (2) వైరుధ్యంయొక్క ప్రధానాంశము, అప్రధాన అంశములను — మనం అధ్యయనం చేయకపోతే, అంటే, వైరుధ్యంయొక్క ఈ రెండు పద్ధతుల నిర్దిష్ట స్వభావాన్ని మనం అధ్యయనం చేయకపోతే మనం గాలిపోగు అధ్యయనంలో కొట్టుకుపోతాం. వైరుధ్యం యొక్కపద్ధతి ఏమిటో నిర్దిష్టంగా అవగాహన చేసుకోలేకపోతాం. తత్ఫలితంగా వైరుధ్యాన్ని పరిష్కరించేందుకు సరైన పద్ధతి ఏమిటో కనుక్కోలేకపోతాం. వైరుధ్యంయొక్క యీ రెండు

పరిస్థితుల విస్పష్టస్వభావంగాని, ప్రత్యేకత్వంగాని వైరుధ్యశక్తుల అసమానత్వానికి సూచికంగా వుంటుంది. తన అభివృద్ధిలో సమగ్రపూరిత సమానత్వంగా వుండేది ప్రపంచంలో ఏదీ లేదు. సరిసమానంగా అభివృద్ధి జెందటము, సరితూగుటము అనే సిద్ధాంతాలను మనంఎదుర్కోవాలి. అదేసమయంలో వైరుధ్యం యొక్క నిర్దిష్టపరిస్థితులు, అభివృద్ధి క్రమంలో వైరుధ్యంయొక్క ప్రధాన, అప్రధాన అంశాలు - ఈ రెండూ పాతవాటిని అతిక్రమించే క్రొత్తవాటి శక్తిని ఖచ్చితంగా చూపెడతాయి. వైరుధ్యంలో అనేక అసమానత్వ పరిస్థితుల అధ్యయనము, ప్రధాన అప్రధాన వైరుధ్యాల అధ్యయనము,వైరుధ్యంయొక్క ప్రధాన అప్రధాన అంశాల అధ్యయనం-ఇదంతా విప్లవరాజకీయపార్టీకి, తనరాజకీయ, మిలిటరీ వ్యూహాన్ని చాకచక్యమైన ఆదేశాలను సరిగ్గా నిర్ణయించుటకు ప్రధానమైన విధానాల్లో ఒకటిగా వుంటుంది. కమ్యూనిస్టులంతా దీన్ని గమనంలో వుంచుకోవాలి.

## 5. వైరుధ్యంయొక్క అంశాల ఐక్యత - సంఘర్షణ (The identity and struggle of the aspects of a contradiction)

వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వ ప్రత్యేకత్వ సమస్యను అర్థంచేసుకున్నాం గనుక మనంవైరుధ్యంయొక్క అంశాలమధ్య ఐక్యత, సంఘర్షణ సమస్యను అధ్యయనం చేయటానికి ముందుకు సాగవలసియుంది.

అభిన్నత్వము, ఐక్యత, ఒకేసారి తటస్థించటము (Coincidence) ఒకదానిలో ఒకటి వ్యాపించటం (Inter permeation), ఒకదానిలోకి ఒకటి చొచ్చుకుపోవటం

(Inter ration), ఒకదానిమీదఒకటి ఆధారపడియుండటం (Inter dependence) (మనుగడ కొరకే పరస్పరాధారం), ఒకదానితో ఒకటి సంబంధం కలిగియుండటం (Inter connection) లేక పరస్పర సహకారం — యీ భిన్నపదాలన్నీ ఒకే అర్థాన్నిస్తాయి. ఈ దిశగా రెండు పరిస్థితులకు సంబంధించి వుంటాయి: మొదటిది, ఒక విషయంయొక్క అభివృద్ధి క్రమంలో వుండే ప్రతి వైరుధ్యంయొక్క రెండు అంశాలు. ప్రతిదీ దాని వ్యతిరేక అంశంతో వుంటూ, రెండూ కలసి ఒకే మొత్తంగాను మనుగుతుంటాయని ముందుగానే నిర్దిష్టమైనట్లు కనుగొంటాయి. రెండవది, ఆయా పరిస్థితులనుబట్టి రెండు విరుద్ధ అంశాల్లో ప్రతిదీ దాని వ్యతిరేక అంశంలోకి మారటానికి ప్రయత్నమవుతుంది. ఐక్యత అంటే యిది.

లెనిన్ యిలా చెప్పాడు:

"గతితార్కికమనే యిలాంటి సిద్ధాంతం: వ్యతిరేక శక్తులు ఏ విధంగా ఐక్యత కలిగివుండగలవో, ఏవిధంగా పోలిక లోకవస్తాయో (ఏవిధంగా అవిమార్పుచెంది పోలికలోకవస్తాయో) ఏపరిస్థితుల్లో వాటంతటఅవి ఒకదానిలోకి ఒకటి మారి పోలిక లోకి వస్తాయో — మానవ మేధస్సు యీ వ్యతిరేక శక్తులను మృతప్రాయంగాను, మొండి విషయాలుగాను గాక సజీవమైనవి గాను, నిబద్ధమైనవిగాను, వాటంతటవి ఒకదానిలోకి ఒకటి మారిపోయే మార్పుకగ్గమైనవిగాను ఎందుకు పరిగణించాలో గతి తార్కిక సిద్ధాంతం అధ్యయనం చేస్తుంది".*

* "హెగెల్ యొక్క 'తర్కము' నుండి తీసిన భాగాలు" అనే లెనిన్ గ్రంథం. ఈ గ్రంథంయొక్క చైనాభాష. తర్జుమానుండి మావ్ యిచ్చట వుదహరించాడు.

లెనిన్ యొక్క యీ వ్యాఖ్యానం అర్థం ఏ : ?

ప్రతి గతిక్రమంలోని విరుద్ధ అంశాలు ఒకదాన్ని ఒకటి విడదొక్కుకుంటాయి, ఒకదానితో ఒకటి సంఘర్షణపడతాయి, ఒకదానికి ఒకటి వ్యతిరేకించి వుంటాయి. ప్రపంచంలోను, మానవుని ఆలోచనలోను వుండే అన్నివిషయాల గతిక్రమాల లోను ఎట్టి మినహాయింపు లేకుండా విరుద్ధ స్వభావం కలిగిన యిలాంటి అంశాలు వుండితీరుతాయి. ఒక సాధారణమైన గతి క్రమంలో వ్యతిరేకశక్తుల జత ఒకటిమాత్రమే వుంటుంది; జటిల మైన గతిక్రమంలో వ్యతిరేకశక్తుల జతలు ఒకటికంటే ఎక్కువ వుంటాయి. అనేక వ్యతిరేకశక్తుల జతలు వంతుప్రకారం ఒక దానికొకటి వ్యతిరేకంగా యుంటుంది. ఈ విధంగానే వస్తు ప్రపంచంలోను, మానవుని ఆలోచనలోను వుండే అన్నివిష యాలు ఏర్పడుతున్నాయి; మరియు ఆచరణలోకి ప్రోత్సహించ బడుతున్నాయి.

కాని అలా అయితే పోలిక లేక ఐక్యత అనేది అసలు వుండదు; అలాంటప్పుడు పోలిక లేక ఐక్యతనుగురించి మన మెలా మాట్లాడగలం ?

విరుద్ధ అంశాలు ఒకదానినుండి ఒకటి విడబడి వుండలేక పోవటమే యిందుకు కారణం. తనను వ్యతిరేకించే రెండో అంశం లేకుండా వుంటే, ప్రతి అంశము తన మనుగడకు గల అవ కాశాన్ని పోగొట్టుకుంటుంది. ఒక్కటి ఆలోచించండి; అన్ని వైరుధ్య విషయాలయొక్క, మానవ మేధస్సులోవుండే అన్ని వైరుధ్యాభిప్రాయాలయొక్క ఏ అంశమైనా స్వతంత్రంగా మన గలదా ? జీవమనేది లేకుండా మృత్యువనేది యుండనేరదు.

మృత్యు లేకుండా జీవమనేది వుండదుగూడా. 'పైన' అనేది లేకుండా 'క్రింద' అనేది వుండదు; 'క్రింద' అనేది లేకుండా 'పైన' అనేది వుండదుగూడా. దురదృష్టమనేది లేకుండా అదృష్టమనేది వుండదు; అదృష్టమనేది లేకుండా దుర దృష్టమనేది వుండదుగూడా. తేలిక అనేది లేకుండా కష్టమనేది వుండదు; కష్టమనేది లేకుండా తేలిక అనేది వుండదుగూడా. భూస్వాములు లేకుండా కౌలుదైతులుండరు; కౌలు రైతులు లేకుండా భూస్వాములు వుండరుగూడా; బూర్జువావర్గం లేకుండా కార్మికవర్గం వుండదు; కార్మికవర్గం లేకుండా బూర్జువావర్గం వుండదుగూడా; దేశాలపై సామ్రాజ్యవాద వలసత్వం లేకుండా వలస, అర్ధవలస దేశాలుండవు; వలస, అర్ధవలస దేశాలు లేకుండా దేశాలపైన సామ్రాజ్యవాద వలసత్వం వుండదు గూడా. ప్రతికూల విషయాలన్నీ యిలాగే వుంటాయి : కొన్ని పరిస్థితుల కారణంగా, ఒకవైపు అవి ఒకదానొకటి వ్యతిరే కించి యుంటాయి. రెండవవైపు అవి అంతస్సంబంధం కలిగి యుంటాయి. అంతర్గతంగా ఒకదానిలోకి ఒకటి చొచ్చుకొని వుంటాయి. ఒకదానిలో ఒకటి వ్యాప్తిజెంది వుంటాయి. ఒక దానిపై ఒకటి ఆధారపడి వుంటాయి; ఈ స్వభావమే ఐక్యత. కొన్ని పరిస్థితుల కారణంగా అన్ని విరుద్ధ అంశాలు ఐక్యత లేక పోవటంవల్ల నిర్వచించబడతాయి. అందువల్ల అవి విరుద్ధమైనవిగా చెప్పుకోబడతాయి. కాని అవి పోలికవల్ల నిర్వచించబడతాయిగూడా. అందువల్ల అవి అంతర్గతంగా ఒకదానిలో ఒకటి సంబంధం కలిగివుంటాయి. "ఏవిధంగా వ్యతిరేకతలు ఐక్యంగా వుండగలవో" గతితార్కికం అధ్యయనం

చేస్తుందని లెనిన్ అనటంలో, అటువంటి పరిస్థితి ఆయన సూచిస్తున్నాడు. అవి ఐక్యంగా ఎలా వుండగలవు? ఒకదాని యొక్క మనుగడను ఒకటి పరస్పరం పోషించుకొనే పరిస్థితే యిందుకు కారణం. పోలిక, లేక ఐక్యత అనేదాని మొదటి అర్థం యిది.

వైరుధ్య అంశాలు ఒకదానిమనుగడను ఒకటి పరస్పరం పోషించుకొంటాయనీ, అనగా వాటిమధ్యపోలిక వుందని పర్యవసానంగా అవి ఒకదానితో ఒకటి ఒక ముక్తంలో మనగలవని మాత్రమే చెప్పటం సరిపోతుందా? లేదు. అది సరిపోదు. రెండు వైరుధ్య అంశాలు తమ మనుగడకొరకు ఒకదానిమీద ఒకటి పరస్పర ఆధారం కలిగి యుంటాయనే దానితో విషయం అంతమవటంలేదు; ఇంతకన్న ముఖ్యమైనదేమంటే వైరుధ్య విషయాలు ఒకదానిలోకి ఒకటి మారటం. అంటే, ఒకవిషయం లోని రెండు వైరుధ్య అంశాలలో ఒక్కొక్కటి, కొన్ని కొన్ని పరిస్థితులవల్ల, తనకు వ్యతిరేకమైన దానిలోకి మారిపోవటానికి, తనకు వ్యతిరేకస్థానంలోకి వెళ్ళిపోవటానికి వుద్యుక్తమవుతుంది. వైరుధ్యంయొక్క పోలిక, లేక ఐక్యత అనేదాని రెండవ అర్థమిది.

పోలికగూడా ఎందుకుంది? చూడండి, ఒకప్పుడు పాలితులుగావున్న కార్మికవర్గం, విప్లవంద్వారా, తానుగా పాలకస్థానంలోకి మారిపోతుంది. అదే సందర్భంలో అసల్లో పాలకులుగావున్న బూర్జువావర్గం పాలితస్థానంలోకి, అసల్లో తన వ్యతిరేకశక్తిచే ఆక్రమించబడియున్న స్థానంలోకిమారిపోతుంది. ఇది అప్పుడే సోవియట్ యూనియన్‌లో జరిగింది; ఇక ప్రపంచ మంతటా జరుగుతుంది. నేనొక విషయం అడగాలని వుంది:

వ్యతిరే...త్య, కొన్నికొన్ని పరిస్థితుల్లో పరస్పరసంబంధము పోలిక లేకపోయినట్లయితే అలాంటిది ఎలా సంభవించగలదు?.

ఆధునిక చైనా చరిత్రలో ఒకానొకదశలో ఒకరకంగా నిర్ణాయకపాత్రను నిర్వహించిన కోమింటాంగు తన వర్గస్వభావం రీత్యాను, సామ్రాజ్యవాదం చూపే ఆకర్షణవల్లను (యివే కారణాలుగా) 1927 నుంచి తనుగా అభివృద్ధినిరోధకపార్టీగా మారిపోయింది; కాని అదే కిరికి చైనా, జపానులమధ్య వైరుధ్యంయొక్క తీవ్రతవల్లను, కమ్యూనిస్టుపార్టీయొక్క ఐక్యసంఘటనా విధానంవల్లను (యివేకారణాలుగా) జపానును ప్రతిఘటించేందుకు అంగీకరించేలా బలవంతంచేయబడింది. వైరుధ్యవిషయాలు ఒకదానిలోకి ఒకటి మారుతాయి; ఈ సందర్భంలో ఒకరకమైన పోలిక లేక ఐక్యతయుంది.

మనం నెరవేర్చిన వ్యవసాయ విప్లవంయొక్కగతిక్రమం భూఖామందులైన భూస్వామివర్గం తనభూమిని కోల్పోయే వర్గంగాను, ఒకప్పుడు భూమిలేనిరైతులు చిన్న భూఖామందులు గాను మారే గతిక్రమంగా యిప్పటికే వుంది. ఇకముందు వుంటుంది. ఉన్నవర్గము, లేనివర్గము, లాభము, నష్టము — యివికొన్ని పరిస్థితులకారణంగా ఒకదానికొకటి సంబంధం కలిగియున్నవి:[1] ఇచ్చట రెండు పక్షాలకు ఐక్యతవుంది. సోషలిజంలో, రైతాంగంయొక్క ప్రైవేటు ఆస్తివిధానం సోషలిస్టు వ్యావసాయిక పబ్లిక్ ఆస్తిగా మారిపోతుంది; ఇది అప్పుడే సోవియట్ యూనియన్‌లో ఆచరణలోకి వచ్చింది. ఇకముందు ప్రపంచమంతటా వస్తుంది. ప్రైవేటు ఆస్తి, పబ్లిక్ ఆస్తులమధ్య ఒకదాన్ని మరోదానితో కలిపే వంతెనయుంది.

తత్వశాస్త్రంలో దీన్నే పోలిక, లేక ఐక్యత, లేక ఒకదానిలోకి ఒకటి మారటం, లేక, ఒకదానిలో ఒకటి వ్యాపించటం అంటారు.

కార్మికవర్గ నియంతృత్వాన్నిగాని లేక ప్రజాస్వామిక నియంతృత్వాన్నిగాని సమీకృత మొనర్చుకోటము సరిగ్గా అట్టి నియంతృత్వాన్ని రద్దుగావించేందు కవసరమైన స్థితులను తయారుగావించుకొని అన్నిరకాల రాజ్యాంగ విధానాలను రద్దుపరచే ఉన్నతదశకు పురోగమించటానికే కమ్యూనిస్టు పార్టీని ఏర్పరచి వృద్ధిగావించటం, సరిగ్గా కమ్యూనిస్టుపార్టీని, అన్ని పార్టీవిధానాలను రద్దుగావించే పరిస్థితిని తయారుచేయ టానికే. కమ్యూనిస్టునాయకత్వంక్రింద విప్లవసైన్యాన్ని నిర్మించి విప్లవపోరాటాన్ని నెరవేర్చటం, సరిగ్గా, శాశ్వతంగా యుద్ధ మనేదిలేకుండా వుండే పరిస్థితిని తయారుచేయటానికే; ఈ వైరుధ్యవిషయాలు అదే సమయంలో పరస్పర సహాయభూత (Complementary) మవుతాయి.

యుద్ధము, శాంతి – యీ రెండూ ఒకదానిలోనికి ఒకటి మారుతుందని ప్రతివారికి తెలిసినదే. యుద్ధం శాంతిగా మార్పుజెందుతుంది; ఉదాహరణకు: ప్రథమ ప్రపంచసంగ్రామం యుద్ధానంతర శాంతిలోకి మారింది; చైనాలో అంతర్యుద్ధం యిప్పుడు ఆగిపోయి ఆంతరంగికంగా శాంతి ఏర్పడింది. శాంతే యుద్ధంగా మార్పుచెందుతుంది; ఉదాహరణకు : 1927 లో కొమింటాంగ్ – కమ్యూనిస్టుపక్షాల పరస్పరసహకారం యుద్ధం లోకి మార్పుచెందింది; శాంతియుతమైన నేటి ప్రపంచపరిస్థితి ద్వితీయ ప్రపంచ సంగ్రామంగా మార్పు జెందవచ్చుగూడ

ఎందువ ...క వర్గసమాజంలో యుద్ధము, శాంతిలాంటి వైరుధ్యవిషయాలు పోలికనుబట్టి కొన్ని పరిస్థితుల్లో స్వభావ నిర్ణయం చేయబడతాయిగనుక.

వైరుధ్య విషయాలన్నీ అంతర్గత సంబంధం కలిగివుంటాయి; అవి కొన్ని పరిస్థితుల్లో ఒకదానితో ఒకటి ఒకే మొత్తంలో మనటమేగాక అవి కొన్ని పరిస్థితుల్లో వాటంతటవి ఒకటి మరోదానిలోకి మార్పుజెందుతాయి గూడా - వైరుధ్యాల పోలిక అనేదానికి మొత్తం భావం యిది.

"...ఏవిధంగా అవి పోలిక లేక ఐక్యతలోకి వస్తాయి. (ఏవిధంగా అవి మార్పుజెంది పోలికలోకి వస్తాయి) - ఏ పరిస్థితుల్లో వాటంతట అవి ఒకదానిలోకి వకటి మారి పోలిక లేక ఐక్యతలోకి వస్తాయి ..." అని లెనిన్ అన్నప్పుడు సరిగ్గా ఆయన వ్యక్తీకరించింది యిదే.

ఎందుచేత మానవమేధస్సు "అట్టి వ్యతిరేకశక్తులను సజీవమైనవిగాను, నిబద్ధమైనవిగాను, వాటంతటవి ఒకదానిలోకి వకటి మారిపోయే మార్పుకర్గమైనవిగాను గాక మృతప్రాయంగాను, మొండివిషయాలుగాను పరిగణించదు"?. ఎందువల్లనంటే. యదార్థ విషయాలు సరిగ్గా అలావున్నాయి గనుక. యదార్థ విషయాలలోని వైరుధ్య అంశాలను ఐక్యతగాని, పోలికగాని ఎన్నడూ మృతప్రాయమైనదిగాను, మొండిగాను గాక సజీవమైనదిగాను, నిబద్ధమైనదిగాను, మార్పుకర్గమైనదిగాను, తాత్కాలికమైనదిగాను, సాపేక్షయుతంగాను వుంది; వైరుధ్య అంశాలన్నీ వాటంతటవి, కొన్ని పరిస్థితుల్లో తమ వ్యతిరేకతలలోకి మారుతాయి. మానవమేధస్సులో ప్రతిబింబించిన యిలాంటి పరిస్థితే మార్క్సిజంయొక్క భౌతికవాద -

గతితార్కిక ప్రాపంచిక దృక్పథం అవుతుంది. కాలపు, గతచరిత్ర కాలపు అభివృద్ధినిరోధక పాలకవర్గాలు, వారి సేవలో యుండిన జడాత్మక తర్కము మాత్రమే వ్యతిరేకతలను సజీవమైనవిగాను, నిబద్ధమైనవిగాను (Conditional), వాటంతటవి ఒకదానిలోని కొకటి మారిపోయే మార్పుకగ్గమైనవిగాను గాక మృతప్రాయమైనవిగాను, మొండివిషయాలుగాను పరిగణించి ప్రజాబాహుళ్యాన్ని మభ్యపరచి, తద్వారా తమ పాలనను ఇంకా సాగించే తమ ఆశయాన్ని సాధించేందుకు ఆ తప్పుడు దృక్పథాన్నే ప్రతిచోటా ప్రచారంచేస్తారు. అటువంటి తప్పులను, అభివృద్ధినిరోధక, జడాత్మకవాద యోచనను బట్టబయలుచేసి వస్తువులలో స్వతహాగాయున్న గతితార్కిక సూత్రాలను ప్రచారంచేయుటము, విప్లవాశయాన్ని సాధించేందుకు విషయాల మార్పును త్వరితం చేయుటము కమ్యూనిస్టుల కర్తవ్యం.

కొన్ని పరిస్థితులలో వైరుధ్యంయొక్క లౌకిక లేక ఐక్యత అన్నప్పుడు మనంచెప్పుకొనే వైరుధ్యాలు నిజమైనవనీ, వైరుధ్య అంశాలు ఒకదానిలోకి ఒకటి పరివర్తనజెందటం కూడా యథార్థమనీ, నిర్దుష్టమనీ మన భావం. పురాణాలలో పేర్కొనబడిన అసంఖ్యాకమైన పరివర్తనలు – ఉదాహరణకు: "గిరులు, సాగరములు" అనే గ్రంథంలో సూర్యునితో 'కాపూ' పందెము *"హాయ్‌నాన్సూ" అనే గ్రంథంలో 'యీూ' అనే

* 'కొండలు, సముద్రములూ' అనే గ్రంథం క్రీస్తుపూర్వం 4, 2 శతాబ్దాలమధ్య రాష్ట్రాల యుద్ధాలాడుకొనే శకంలో వ్రాయబడింది. అందులో ఒక కథలో కూపూ అనే పాత్ర సూర్యునితో పందెమువేసిన మానవాతీతమైన వ్యక్తిగా చిత్రించబడతాడు. ఆ పందెం గెలిచి సూర్యుని ప్రాంతాలయందంతా పర్యటన గావించి చివరకు దప్పిక బాధచే చనిపోతాడు.

అతను [illegible]దిమంది సూర్యులను క్రిందకు పడగొట్టటము ♦ "పశ్చిమానికి తీర్థయాత్ర" అనే గ్రంథంలో వానరముయొక్క డెబ్బదిరెండు రకాల అవతారములు * "నిర్లక్ష్య నాటకశాల (Carefree Studio) నుండి వింతగాథలు" అనే గ్రంథంలో మనుష్యులుగా చిత్రించబడిన దయ్యాల, నక్కల పిట్టకథలు ♦ వగైరా పురాణగాథల్లో చెప్పబడినట్లు వ్యతిరేకతలు ఒకటి మరోదానిలోకి చెందే పరివర్తనలు – అన్నీ ఒకరకమైన ఆటకాయితనపు, వ్యూహాజనిత, స్వకీయాత్మక పరివర్తనలే;

---

♦ 'యీ' పురాతన చైనాలో పురాణవీరులలో ఒకడు. ప్రత్యేకంగా విలువిద్యలో పేరెన్నికగన్న వ్యక్తి. క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దంలో యువరాజైన 'లీ అన్' ఆధ్వర్యాన కూర్చబడిన 'హైనాన్ నూ' అనే గ్రంథానుసరించి 'యావ్' చక్రవర్తి కాలాన ఆకాశంలో 10 మంది సూర్యులున్నారు. సూర్యులవల్ల జీవోత్పత్తికి సంభవించిన ప్రమాదం దృష్ట్యా సూర్యులను పడగొట్టమని 'యావ్' 'యీ' ని ఆజ్ఞాపించాడు. లీ అన్ కు సమకాలికుడైన ఒకటవ వాంగ్ చే వ్రాయబడిన మరొక కథలో విలువిద్యకాడు 10 మంది సూర్యులలో 9 మందిని పడగొట్టినట్టు చెప్పబడింది.

* పశ్చిమానికి తీర్థయాత్ర అనే పురాణ (Mythological) నవల 16 వ శతాబ్దంలో వ్రాయబడింది. ఆ నవలలో కథానాయకుడైన 'సన్ వూ కుంగ్' మానవుడుగా చిత్రించబడిన వానరం. వాడు తనంతటతాను పక్షులు, జంతువులు, మొక్కలు, నిర్జీవ పదార్థములంటూ 72 రూపాలలోకి మారగలిగే విచిత్రమైన శక్తి సంపన్నుడు. 'వానరుడు' అనే పేర ఆర్థర్ వాలీచే వ్రాయబడిన సంక్షిప్త ఆంగ్ల తర్జుమాకూడా వుంది.

♦ 'కేర్ ఫ్రీ నాటకశాలనుండి అపూర్వ గాథలు' అనే గ్రంథం 17 వ శతాబ్దంలో 'పూ సుంగ్ లింగ్' చే వ్రాయబడిన చిన్న కథల సంపుటి. జానపద గాథలనుండి సేకరించబడిన దేవతల, దెయ్యాల, నక్కల, పిట్టకథలు 431 యిందులో వున్నాయి. 'చైనా నాటకశాలనుండి అపూర్వగాథలు' అనే పేరుతో హెర్బర్ట్ గైల్సుచే వ్రాయబడిన యింగ్లీషు తర్జుమా వుంది.

ఇవి జటిలమైన, నిజమైన వైరుధ్యాలు. ... దానిలోకి ఒకటి చెందే అసంఖ్యాక పరివర్తనలద్వారా మానవుల్లోకి ప్రవేశిస్తాయి; అందుచేత అవి యథార్థమైన వైరుధ్యాల్లో ద్యోతకమైయ్యే పరివర్తనలు కావు. మార్క్స్ యిలా అన్నారు: "పురాణ సముదాయమంతా (Mythology) వూహల్లోగుండా ప్రకృతి శక్తులపై ఆధిపత్యాన్ని, ఆధిక్యతను సంపాదించి రూపురేఖలను దిద్దుతుంది, అందువల్ల ప్రకృతి శక్తులపై మానవుడు ఆధిపత్యాన్ని సాధించినవెంటనే అది (పురాణం) అదృశ్యమవుతుంది" అటువంటి పురాణాల్లోను (Mythology) (బాల్య గాథలలోగూడా) అసంఖ్యాకమైన (Endless) విచిత్రపాత్రల గాథలు ప్రజలను రంజింపచేయ గలవు; ఎందువల్లనంటే, వాటిల్లో ప్రకృతిశక్తులు మొదలైన వాటిపై మానవుని విజయం ఊహాయుతంగా పొందుపరచబడి యుంది. అంతకంటే మించి, గొప్ప పురాణ లో " శాశ్వతమైన సొగసు" (మార్క్స్) గర్భితమైయుంది; అయినప్పటికీ, పురాణం యథార్థమైన వైరుధ్యాలయొక్క ప్రత్యేక పరిస్థితుల ప్రాతిపదికపై ఏర్పడలేదు గనుక యథార్థంయొక్క శాస్త్రీయ ప్రతిబింబంకాదు. అంటే, పురాణంలోను, బాల్య గాథలలోను వైరుధ్యంగా ఏర్పడిన అంశాలకు నిర్దిష్టమైన పోలికగా వూహాత్మకమైన పోలికమాత్రమే యుంది. యథార్థమైన పరివర్తనల్లో శాస్త్రీయంగా పోలికను, లేక ఐక్యతను ప్రతిబింబించే దేదో అదే మార్క్సిస్టు గతితర్కం.

ఒకరాయి కోడిపిల్లగా మార్పుచెందలేకపోగా ఎందువల్ల ఒకగ్రుడ్డు కోడిపిల్లగా పరివర్తనచెంద గలుగుతుంది? యుద్ధానికి,

ఒకబండ మధ్య పోలిక లేకపోగా ఎందువల్ల యుద్ధానికి, శాంతికి మధ్య పోలిక లేక ఐక్యత వుంది? ఎందువల్ల మానవులు యితర మైనదేదీకాకుండా మానవులనే ప్రసవిస్తారు? ఇందుకు కారణం వైరుధ్యంయొక్క పోలిక కొన్ని అవసరపరిస్థితులలోమాత్రమే మనుతుంది అనేదితప్ప వేరేదీకాదు. కొన్ని అవసరపరిస్థితులు లేకుండా ఏ విధమైన పోలికయుంటూ వుండదు.

ఫ్రాన్సులో బూర్జువా విప్లవం సరాసరి సోషలిస్టు విప్లవంలో లంకెబడకపోగా, 1871 పారిస్ కమ్యూన్ ఆఖరులో ఓటమిలో ముగియగా, ఎందువల్ల రష్యాలో 1917 ఫిబ్రవరి బూర్జువా ప్రజాతంత్ర విప్లవం సరాసరి అదే సంవత్సరం అక్టోబరు కార్మికవర్గ సోషలిస్టు విప్లవంలో లంకెబడింది? రెండవ వైపు ఎందువల్ల మంగోలియా, మధ్య ఆసియాలలోని ఆటవిక విధానం సరాసరి సోషలిజంలో లంకె పెట్టబడింది? ఎందువల్ల చైనా విప్లవం పశ్చిమరాజ్యాల పాతచారిత్రకమార్గాన పయనించకుండా, బూర్జువా నియంతృత్వదశగుండా ప్రయాణం చేయకుండా, పెట్టుబడిదారీ భవిష్యత్తును విసర్జించగలిగి సరాసరి సోషలిజంలో లంకె వేయబడగలదు? ఇందుకు కారణం ఆయా కాల నిర్దిష్ట పరిస్థితులు తప్ప వేరుకాదు. కొన్ని అవసరమైన పరిస్థితు లున్నప్పుడు వస్తువులయొక్క అభివృద్ధి గతిక్రమంలో కొన్ని వైరుధ్యాలు ఏర్పడతాయి. అంతకంటే మించిందేమంటే యీ వైరుధ్యాలు, యీ రకపు అన్ని వైరుధ్యాలు, తమ మనుగడకొరకు ఒకదానిపై ఒకటి ఆధారపడతాయి. వాటంతటవి ఒకదానిలోని కొకటి పరివర్తన చెందుతాయి; అలా కాకపోతే, ఏదీ సాధ్యంకాదు.

పోలిక లేక ఐక్యత అనే సమస్య యిల ... ఇక సంఘర్షణ అంటే ఏమిటి? పోలిక సంఘర్షణ మధ్య సంబంధం ఎలాంటిది?

లెనిన్ యిలా అన్నారు:

"వ్యతిరేకశక్తులయొక్క ఐక్యత (రెండూ ఒకసారి తటస్థించటము, పోలిక, పర్యవసానము) నిబద్ధమైనదిగాను, తాత్కాలికము, మార్పుకగ్గమైనది, సాపేక్షతగలదిగానువుంది."

లెనిన్ రచనలో యీ భాగంయొక్క అర్థం ఏమిటి?

అన్ని గతిక్రమాలు ఆద్యంతాలను కలిగివుంటాయి. గతిక్రమాలన్నీ వాటంతటవి తమ వ్యతిరేకతలలోకి పరివర్తన చెందుతాయి. అన్ని గతిక్రమాల స్థిరత్వము (Stability) సాపేక్షతాయుతంగా వుంటుంది. కాని ఒక గతిక్రమం మరో గతిక్రమంలోకి చెందే పరివర్తనలో ప్రదర్శితమయే మార్పు సంపూర్ణమైందిగా వుంటుంది.

అన్ని వస్తువుల చలనానికి రెండు రూపాలుంటాయి: సాపేక్షయుతమైన విశ్రాంతి (Relative rest) రూపం ఒకటి, విస్పష్టమైనమార్పు (Conspicuous change) రూపం ఒకటి. చలనంయొక్క యీ రెండురూపాలు ఒక వస్తువులోనే యిమిడి యున్న రెండు వైరుధ్యవిషయాల పరస్పర సంఘర్షణద్వారా కల్పించబడుతున్నాయి. ఒకవస్తువు (విషయం) యొక్క చలనం మొదటిరూపాన్ని (సాపేక్షయుతమైన విశ్రాంతిరూపం) వహించి నప్పుడు అది గుణమార్పును గాక, పరిమాణమార్పును జెందుతుంది. తత్పర్యవసానంగా విశ్రాంతిగా కనబడే ఒక రకమైన స్థితిలో ద్యోతకమవుతుంది. ఒక వస్తువు (విషయం) యొక్క

చలనం రూపాన్ని వహించేటప్పటికి, అది మొదటిరూపం యొక్క పరిమాణమార్పులో ఒకరకమయిన చివరిస్థానానికి (Culmination) చేరియుంటుంది. మొత్తంగా వున్నదాన్ని వికలమొనర్చియుంటుంది. గుణమార్పును కలిగించియుంటుంది. తత్పర్యవసానంగా నిష్పష్టమైన మార్పు స్థితిలో కనబడుతుంది. అయినంతవరకు ఐక్యత (Unity), మిత్రత్వం (Solidarity), కలిసి పోవటము (Amalgamation), సౌహార్దత (Harmony), సరిసమానం (Balance), నిస్సృత (Stalemate), ప్రతిస్తంభన (Deadlock), విశ్రాంతి (Rest), స్థిరత్వం (Stability), కలయిక (Coagulation), ఆకర్షణ (Attraction), మనం నిత్యానుభవంలో చూస్తున్నట్లు, యివన్నీ పరిమాణమార్పులో వస్తువుల యొక్క రూపాలు. మరోవైపు, ఒకేమొత్తం (Entity), వికలమైపోవటం, అట్టి మిత్రత్వం కలసిపోవటం, సౌహార్దత, సరిసమానము, నిస్సృత, ప్రతిస్తంభన, విశ్రాంతి, స్థిరత్వము కలయిక, ఆకర్షణ.

తమయొక్క ప్రతికూలస్థితుల్లోకి మారటం – యివన్నీ ఒక గుణక్రమం మరోదానిలోకి పరివర్తనం (Transformation) చెందే సందర్భంలో గుణమార్పుస్థితిలో వుండే వస్తువులరూపాలు. వస్తువులు తమంతటతాము సదా ఎడతెగకుండా మొదటిరూపం నుండి రెండవ రూపంలోకి పరివర్తన చెందుతుంటాయి. అదే సమయంలో వైరుధ్యాల లోపలి సంఘర్షణ రెండు రూపాలలో వుండి, రెండవరూపంలో తన పరిష్కారాన్ని పొందుతుంది. కనుక మనం వ్యతిరేక శక్తులయొక్క ఐక్యత (Unity) అనేది నిబద్ధమైనదనీ (Conditional), తాత్కాలికమైనదనీ, సాపే

క్షము గలదనీ చెబుతాం. పరస్పరం విడబడే వ్యతి ... యొక్క సంఘర్షణ సంపూర్ణమైనదనీ చెబుతాం.

రెండు వ్యతిరేకవిషయాల (వస్తువుల) (Things) మధ్య పోలిక లేక ఐక్యత వున్నది గనుక ఆ రెండూ ఒకే మొత్తం (Entity) లో కలిసి మనగల (Co-exist) వనీ, మరియూ ఒకదానిలోకి ఒకటి పరివర్తనచెందగలవనీ మనం పైన చెప్పినప్పుడు నిబద్ధమనే విషయం (Conditionality) మన దృష్టిలో వుంది. అంటే కొన్ని పరిస్థితుల్లో వైరుధ్యవిషయాలు ఐక్యపరచబడగలవు; మరియు ఒకదానిలో కొకటి పరివర్తన చెందించబడగలవు. కాని అట్టి పరిస్థితులు (Conditions) లేకుండా అవి విరుద్ధం కాజాలవు. కలసి మనలేవు; మరియు ఒకదానిలోకి ఒకటి పరివర్తన చెందలేవు. కొన్ని పరిస్థితుల్లోమాత్రమే వైరుధ్యంయొక్క పోలిక లేక ఐక్యత సంభవమవుతుంది; గనుక మనం పోలిక నిబద్ధమైనదని (Conditional) సాపేక్షత కలిగి యున్నదని చెబుతాం. ఇచ్చట మనం యిది కలుపుదాం: ఒక గతిక్రమంలో మొదటినుండి చివరివరకు వైరుధ్యంలో సంఘర్షణ పనుగిడుతుంది. మరియు ఒక గతిక్రమం మరో దానిలోకి పరివర్తనచెందేలా చేస్తుంది. వైరుధ్యంలోపల సంఘర్షణ ప్రతిచోటా వుంటుంది గనుక, వైరుధ్యంలోపలి సంఘర్షణ నిబద్ధము కానిదనీ, సంపూర్ణమైనదనీ మన మంటాం.

నిబద్ధము, సాపేక్షత, పోలిక లేక ఐక్యత – యివి నిర్నిబంధము, సంపూర్ణము, సంఘర్షణతో కలిసిపోవటమే వస్తువులన్నిటిలోను వ్యతిరేకశక్తుల చలనంగా ఏర్పడుతుంది.

...ములం "ఒకదాని కొకటి వ్యతిరేకంగావున్న వస్తువులు ఒకదాని కొకటి సహకరించుకొంటాయి. *అని తరచుగా అంటుంటాం. అంటే, వ్యతిరేకతల పోలిక లేక ఐక్యత యున్నదన్నమాట. ఈ సామెత గతితార్కికమైనట్టిది. ఇది జడాత్మక తర్కానికి వ్యతిరేకము. "ఒకదాని నొకటి వ్యతిరేకించటం" అంటే రెండు వైరుధ్య అంశాలమధ్య సంఘర్షణ లేక పరస్పరం విడపోవటం. "ఒకదానితో ఒకటి సహకరించుకోటం" అంటే రెండు వైరుధ్య అంశాలు, కొన్ని పరిస్థితుల్లో ఐక్యమవుతాయని, పోలికను సాధిస్తాయని అర్థం. సంఘర్షణ అనేది సరిగ్గా పోలిక లేక ఐక్యతలోనే వుంటుంది; పోరాటం లేకుండా పోలిక లేక ఐక్యత అనేవి వుండనేరవు.

ఐక్యతలో సంఘర్షణ యున్నది. ప్రత్యేకత్వంలో విశ్వవ్యాపకత్వముంది. వ్యక్తి స్వభావంలో సాధారణ స్వభావం వుంది. లెనిన్ మాటల్లో చెప్పాలంటే, "సాపేక్షతలోగూడా సంపూర్ణత్వమనేది వుంది."

## 6. వైరుధ్యంలో ప్రాతికూల్యంయొక్క పాత్ర
## (The role of Antagonism in contradiction)

వైరుధ్యంలోనే సంఘర్షణ అనే సమస్యకు సంబంధించిన ప్రశ్నల్లో, ప్రాతికూల్యం (Antagonism) అంటే ఏమిటి ? అనే ప్రశ్న ఒకటుంది. మన సమాధానం యిది: ప్రాతికూల్య

* ఈ సామెత క్రీ. శ. ఒకటవ శతాబ్దంలో పేరెన్నికగాంచిన చరిత్రకారుడు పాన్ కూ వ్రాసిన "ఆది హాన్ రాజవంశపు చరిత్ర" అనే గ్రంథంలో ప్రథమంగా కనబడింది. అప్పటినుండి బహుళంగా వాడబడే సామెతగా వుంది.

మనేది నైరుధ్యాలోపలి ఒక సంఘర్షణరూప ... నైరుధ్యంలోపలి సంఘర్షణయొక్క విశ్వవ్యాపకరూ... కాదు.

మానవచరిత్రలో, వర్గాలమధ్య ప్రా...ల్య మనేది నైరుధ్యంలోపలి సంఘర్షణయొక్క ప్రత్యేక ...కడ (Manifestation) గా యుంటుంది. దోపిడిచేసే ...ర్గము, దోపిడి చేయబడే వర్గములమధ్య నైరుధ్యం; పరస్పర...రుధ్యం గలిగిన యీ రెండువర్గాలు చాలాకాలంవరకు ఒకే స...మాజంలో అవి బానిస సమాజంగానీ, లేక ఫ్యూడల్ సమాజంగానీ, పెట్టుబడిదారీ సమాజంగానీ – కలసివుంటూ ఒకదానితో ఒకటి సంఘర్షణ పడుతుంటాయి; అయితే యీ రెండు వర్గాలమధ్య నైరుధ్యం ఒకదశకు అభివృద్ధిచె ...దేవర ... యు...ద్ధాలు విప్లవంలోకి పెంపొందే ప్రత్యక్ష వ్యతిరేకరూపాన్ని తీసుకోవు. వర్గ సమాజంలో శాంతి యుద్ధంలోకి పరివ...ర్తనచెందటంగూడా అలాగేవుంటుంది.

ఒక బాంబు యింకా పేలకుండా వున్న సమయంవరకు నైరుధ్యవిషయాలు, కొన్ని పరిస్థితుల్లో ఒకేమొ...త్తంలో కలసివుండే సందర్భంగా వుంటుంది. ఇక నూతనపరిస్థితి (బాంబును ము...ట్టించటం) సంభవించేంతవరకు ప్రేలుడు జరగదు. అన్ని ప్రకృతి విషయాలలోను ఒకే రకమైన స్థితి వుంటూ...వుంది; కాని అవి పాతనైరుధ్యాలను పరిష్కరించుకోటానికి, క్రొత్త విషయాలను కలుగజేయటానికి ఆసాంతంలో ప్రత్యక్ష ప్రాతికూల్యరూపాన్ని వహిస్తాయి.

ఈ స్థితిని తెలుసుకోటం చాలా ము...ఖ్యం. ఎ...దుకంటే వర్గసమాజంలో విప్లవాలు, విప్లవయుద్ధాలు అనివార్యమనీ,

అవి లేకుండా సాంఘిక పరిణామాభివృద్ధిలో గంతు (Leap) (ఆకస్మిక మార్పు) అసాధ్యమనీ, మరియు ప్రజలు రాజకీయాధికారాన్ని సాధించుకునేలా అభివృద్ధినిరోధక పాలకవర్గాలు పడగొట్టబడలేవనీ మనం అవగాహన చేసుకోగలిగేలా యిది చేస్తుంది. సాంఘికవిప్లవం అనవసరము, అసాధ్యము అని, యింకా యింకా అభివృద్ధినిరోధకులు చేసే అసత్యప్రచారాన్ని బట్టబయలుచేసి, కమ్యూనిస్టులు సాంఘికవిప్లవం సంపూర్ణంగా అవసరమేగాక, సంపూర్ణంగా సాధ్యమని, యావత్తు మానవ చరిత్రా, సోవియట్‌యూనియన్‌లో సాధించబడిన విజయమూ యీ శాస్త్రీయమైన సత్యాన్నే రుజువుచేస్తున్నాయనీ ప్రజలు అర్థంచేసుకొనేలా సహాయపడటానికిగాను మార్క్సు, లెనిన్ల సాంఘిక విప్లవసిద్ధాంతాన్ని దృఢంగా బలపర్చాలి.

ఎలాగైనా, మనం వైరుధ్యంలోపలి పలురకాల సంఘర్షణయొక్క పరిస్థితులను నిర్దిష్టంగా (Concretely) అధ్యయనం చేయాలి. పైన పేర్కొన్న సూత్రాన్ని ప్రతి విషయానికీ అనుచితంగా, బలవంతంగా వర్తించకూడదు. వైరుధ్యము, సంఘర్షణ అనేవి విశ్వవ్యాపితము; సంపూర్ణము; కాని వైరుధ్యాలను పరిష్కరించే విధానాలు-అనగా, సంఘర్షణరూపాలు-వైరుధ్యాల స్వభావంలో విభేదాల ననుసరించి భేదిస్తాయి. కొన్ని వైరుధ్యాలు ప్రత్యక్ష ప్రాతికూల్యతద్వారా స్వభావనిర్ణయం చేయబడతాయి; కొన్ని అలాకావు. వస్తువుల నిర్దిష్టమైన అభివృద్ధి నాధారంచేసుకొని, అసల్లో ప్రాతికూల్యతలేని కొన్ని వైరుధ్యాలు అభివృద్ధిచెంది, ప్రాతికూల్యత చెందుతాయి.

అదే సందర్భంలో అసల్లో ప్రతికూలమైన కొన్ని వైరుధ్యాలు అభివృద్ధయి ప్రతికూలత లేనివిగా తయారవుతాయి.

ముందుచెప్పిన మాదిరిగా, కమ్యూనిస్టుపార్టీ లోపల సరైన సిద్ధాంతానికి, తప్పుడు సిద్ధాంతాలకు మధ్యవుండే వైరుధ్యం, బయటవున్న వర్గాలమధ్య వుండే వర్గవైరుధ్యం యొక్క ప్రతిబింబం. ప్రారంభంలోను, లేక ప్రత్యేక విషయాల ననుసరించి, అటువంటి వైరుధ్యం ప్రతికూలమైనదిగా వెంటనే ప్రదర్శితమవనవసరంలేదు. కాని వర్గపోరాటం అభివృద్ధిచెందడంతో, అదికూడా అభివృద్ధయి ప్రతికూలతగాతయారుకావచ్చు. లెనిన్ స్టాలిన్ల సక్రమ సిద్ధాంతానికి, ట్రాట్స్కీ, బుఖారిన్, తదితరుల తప్పుడు సిద్ధాంతాలకు మధ్య వైరుధ్యం ప్రారంభంలో ప్రతికూలరూపంలో ప్రదర్శితమవలేదనీ, కాని దరిమిలా ప్రతికూలతలోకి అభివృద్ధిచెందిందని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర మనకు నేర్పుతోంది. అలాంటి సందర్భమే చైనా కమ్యూనిస్టుపార్టీచరిత్రలో సంభవించింది. పార్టీలో చాలామంది కామ్రేడ్స్ యొక్క సక్రమ సిద్ధాంతానికి, చెన్‌టూషు, చాంగ్ కూటావో తదితరుల తప్పుడు సిద్ధాంతాలకు మధ్య వైరుధ్యం ప్రారంభంలో ప్రతికూలరూపం వహించలేదు; కాని దరిమిలా ప్రతికూలతలోకి అభివృద్ధి చెందింది. ప్రస్తుతం మనపార్టీలో సక్రమసిద్ధాంతానికి, తప్పుడుసిద్ధాంతాలకు మధ్య వైరుధ్యం ప్రాతికూల్యరూపంలో ప్రదర్శితమవటంలేదు. తప్పులు చేసిన కామ్రేడ్స్ వాటిని సరిదిద్దుకొనేట్లయితే అది ప్రతికూలతలోకి పెరగదు. కనుక పార్టీ ఒకవైపు తప్పుడుసిద్ధాంతాలకు వ్యతిరేకంగా తీవ్రపోరాటాన్ని సాగించాలి. రెండవవైపు

తప్పులు చేసిన కామ్రేడ్స్ వాటిని తెలుసుకొనేందు కవసరమైన అవకాశం యివ్వాలి. అట్టి పరిస్థితుల్లో, కొనసకంటూ నెట్టబడిన పోరాటాలు ఖచ్చితంగా వుచితమనిపించుకోవు. కాని, తప్పులు చేసినవారు వాటినే కొనసాగిస్తూ తమ తప్పుల తీవ్రతను పెంచితే, అప్పుడు అట్టి వైరుధ్యాలు ప్రతికూలతలోకి అభివృద్ధి చెందే అవకాశం వుంటుంది.

ఆర్థికంగాచూస్తే, పెట్టుబడిదారీసమాజంలోను (ఇచ్చట బూర్జువాపాలనక్రింద పట్టణం నిర్దాక్షిణ్యంగా పల్లెలను దోచుకుంటుంది). చైనాలో కొమింటాంగు పాలిత భూభాగంలోను (ఇచ్చట విదేశీసామ్రాజ్యవాదము, దానికి దాసోహమైన స్థానిక బడాబూర్జువావర్గముల క్రింద పాలించబడేపట్టణం అతి నికృష్టంగా పల్లెలను దోచుకుంటుంది). పట్టణము, పల్లెలమధ్య వైరుధ్యం అతి తీవ్రమైన ప్రతికూలస్థాయిలో వుంటుంది. కాని, సోషలిస్టు సమాజంలోను, మన విప్లవ స్థావరాల్లోను అట్టి తీవ్ర ప్రతికూలమైన వైరుధ్యం ప్రాతికూల్య రాహిత్య (Non-antagonistic) వైరుధ్యంగా మారుతుంది; కమ్యూనిస్టు సమాజం ఏర్పడినప్పుడు అది అసలే అదృశ్యమైపోతుంది.

లెనిన్ యిలా అన్నారు:

ప్రతికూలత, వైరుధ్యములు పూర్తిగా భిన్నమైనవి. సోషలిజంలో ప్రాతికూల్యం అదృశ్యమవుతుంది. కాని వైరుధ్యం వుంటుంది. అనగా ప్రాతికూల్య మనేది వైరుధ్యంలో వుండే ఒక పోరాటరూపం మాత్రమే. కాని దాని విశ్వవ్యాపితరూపం కాదు. మనం యీ సూత్రాన్ని సర్వత్రా వర్తింపజేయలేము.

## 7. ముగింపు (Conclusion)

ఇచ్చటికి చేరుకున్నాం గనుక, ముగింపులో మనం కొన్ని విషయాలు చెప్పగలం. వస్తువులలో వైరుధ్యసూత్రం, అనగా వ్యతిరేకశక్తుల మధ్య ఐక్యత అనేది ప్రకృతిసమాజముల మూలసూత్రం, కనుక ఆలోచనకుగూడా మూలసూత్రమే. ఇది జడాత్మకతర్క ప్రాపంచిక దృక్పథానికి విరుద్ధం. మానవ విజ్ఞానచరిత్రలో యిదొక మహావిప్లవం. గతితార్కిక భౌతికవాద దృక్పథా న్ననుసరించి వైరుధ్య మనేది దృగ్గోచర వస్తువులయొక్క (Objective things) స్వకీయాత్మక ఆలోచన యొక్క అన్ని గతిక్రమాలలోనువుంటూ అన్నిగతిక్రమాలగుండా ఆద్యంతములు పరుగిడుతుంది. ఇదే వైరుధ్యంయొక్క విశ్వ వ్యాపకత్వము, సంపూర్ణత్వము. వైరుధ్య వస్తువులు- (విషయాలు)- వాటి ప్రతిఅంశము తమతమ ప్రత్యేకమైన లక్షణాలను కలిగియుంటుంది. ఇదే వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వము (Particularity), సాపేక్షతయును. వైరుధ్యవస్తువులు, కొన్ని పరిస్థితులననుసరించి, పోలికలేక ఐక్యత (Identity) ద్వారా నిర్ణయించబడతాయి. తత్పర్యవసానంగా ఒకే మొత్తంలో కలిసి వుండగలవు; మరియు ప్రతిదీ తన వ్యతిరేకతలోకి పరివర్తన (Transform) జెందగలదు - తిరిగీ, యిదే వైరుధ్యంయొక్క ప్రత్యేకత్వము, సాపేక్షతయును. అయితే వైరుధ్యం లోపలి సంఘర్షణ నిరంతరాయంగా వుంటుంది; అది వ్యతిరేకతలు కలిసివుండే సమయంలోగాని, లేక అవి ఒకదానిలో కొకటి పరివర్తన జెందుతుండే సమయంలోగాని వుంటుంది; అవి (వ్యతిరేకతలు) ఒకదానిలోకొకటి పరివర్తన చెందునప్పుడు సంఘర్షణ

ప్రత్యేకంగా ప్రదర్శితమవుతుంది - తిరిగీ, యిదే వైరుధ్యం యొక్క విశ్వవ్యాపకత్వము, సంపూర్ణత్వమూను. వైరుధ్యం యొక్క ప్రత్యేకత్వ, సాపేక్షత (Relativity) లను అధ్యయనం చేసేటప్పుడు మనం వైరుధ్యాల్లోను, వైరుధ్య అంశాల్లోను ఏది ప్రధానమైంది, ఏది అప్రధానమైంది అనే విచక్షణను గుర్తించాల్సి యుంటుంది; వైరుధ్యంయొక్క విశ్వవ్యాపకత్వాన్ని, వైరుధ్యం లోపలి సంఘర్షణను అధ్యయనం చేసేప్పుడు మనం వైరుధ్యం లోపల వివిధ సంఘర్షణ రూపాలను ర్తించాల్సియుంటుంది; లేనియెడల మనం తప్పులు చేస్తాం.

యనం తర్వాత, పైన చెప్పబడిన ముఖ్య విషయాలను నిజంగా అవగాహన చేసుకొనియుంటే, మార్క్సిస్టు, లెనినిస్టు మూలసూత్రాలను అతిక్రమించే, మన విప్లవాశయానికి వినాశకరమయే, ఛాందసపు భావాలను మనం ధ్వంసం చేయగల్గుతాం. అనుభవజ్ఞులైన మన కామ్రేడ్స్ తమ అనుభవాలను క్రమబద్ధం చేసుకొని వాటికి సూత్ర స్వభావాన్ని కలిగించుకొనేలాగున్నూ, కూపస్థమండూక తప్పులను మరల చేయకుండా తప్పించుకొనేలాగున్నూ చేసుకొగలుగుతారు. వైరుధ్య సూత్రాధ్యయనంలో మన మందుకొన్న కొన్ని సాధారణమైన నిర్ణయాలివే.



78

# GLOSSARY

| | |
|---|---|
| Metaphysics | జడాత్మక తర్కం |
| Idealist Dialectics | భావవాద గతితార్కికము |
| Opposites | వ్యతిరేకశక్తులు, వ్యతిరేకతలు |
| Antagonism | ప్రతికూలత, ప్రాతికూల్యము |
| Universality | విశ్వవ్యాపకత్వము |
| Particularity | ప్రత్యేకత్వము |
| Materialist Dialectical world outlook | గతితార్కిక భౌతికవాద ప్రాపంచిక దృక |
| Aspect | అంశము |
| Process | గతిక్రమము |
| Relativity | సాపేక్షత |
| Combination | సంలీనము |
| Decomposition | పృథఃకరణము |
| Subjective | స్వకీయాత్మకము |
| Things | వస్తువులు, విషయములు |
| Identity | పోలిక లేక ఐక్యత |
| Struggle | సంఘర్షణ |
| Transformation | పరివర్తన |
| Analysis | పరిశీలన |
| Contradiction | వైరుధ్యము |

★



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B200 |
| పుస్తకం పేరు | వైరుధ్యం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | soumya |
| పేజీలు విడదీసినది | soumya |
| స్కాన్ చేసినది | Ashwini |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |